# శ్రీ శంకరాచార్య తోహరగానం





శ్రీ శ్రీ శ్రీ భగవాన్ చిద్గగనానంద మహర్షుల

ప్రియశిష్యులైన

ఎన్. నిఖిలానందగుప్తగార్లు

వారిధర్మపత్ని శ్రీమతి మహిళామాతాగార్లు

వారి పుత్రులు

# శ్రీ శంకరాచార్య తోహరగానం



శ్రీ శ్రీ శ్రీ భగవాన్ చిద్గగనానంద మహర్షుల

ప్రియశిష్యులైన

ఎన్. నిఖిలానందగుప్తగార్లు

వీరిధర్మపత్ని శ్రీమతి మహిళామాతాగార్లు

వీరి పుత్రులు

శివరాం గుప్తగారు

1955

॥ శ్రీ చిద్ఘనానంద సద్గురు పరబ్రహ్మణేనమః ॥

# విజ్ఞాపనము

అధ్యాత్మ విద్యాజిజ్ఞాసువులారా ?

అనంతకోటి జన్మ సుకృతపరిపాకమున భారత భూమిలో ఆస్తికులుగా జన్మించుట. ఇట్టిభారతమున ఔన్నత దశపొందిన మైసూరు దేశములో కోలారు మండలమునకు, ప్రధానపట్టణముతోను, శీతలముగాను ప్రకాశించుచు, బంగారు గనులతోను, అనేకఋషులు తపంబొనర్చి ఆత్మ శాంతినిబొందిన శతశృంగపర్వతరాజముచేతను, త్రివిధతాపములు తొలగించు అంతర్గంగియను పుణ్యసలిలముతోను విరాజిల్లు కోలారు నగరమునకు ఆర్యవైశ్యమండలివారి ప్రేరణచే ప్రముఖులగు శ్రీయుత బి. ఎల్. శ్రీరాములు గారు, ఎస్. వి. రామయ్యగారు, వి. చంద్రయ్యగారు, ఎ. వి. లక్ష్మినారణయ్యగారు, ఎస్. నారాయణయ్యగారు సి. శంకరనారణయ్యగారు, డి. వెంకటేశయ్యగారు, ఎస్. బాలలక్ష్మయ్యగారు వీర్లచే ఆహ్వానింపబడి 7-10-54 తేదీనుండి శ్రీవాసవికన్యకాపురాణము మహదానందంతో జరుపబడి ధర్మప్రకాశ ఎస్. వి. శ్రీనివాసశ్రేష్ఠివారి శారదాంబ ధర్మశాలయందు త్యాగులు ఉదారులు నిత్యకర్మానుష్ఠాననిరతులు, నగు ఆర్యవైశ్యభక్తులచే శ్రీ శ్రీ శ్రీ శంకరాచార్యుల చరిత్ర చెప్పబడెను. ఆ సమయమున ఎల్. శివరామగుప్త బాలకుడు 2 సంవత్సరముల క్రితము బెంగ



గీతాప్రకాశకులు:—

నల్లపేట రామయ్య శ్రేష్ఠి వీరి ధర్మపత్ని శ్రీమతి కామాక్షమ్మగార్లు.

శ్రీ చిద్గగనానంద స్వామినేనమః

విద్యాతపోభ్యాం పూతాత్మా
తపసా కిల్బిషంహన్తి విద్యయాఽమృతమశ్నుతే
స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్

2 మాతానాస్తి పితానాస్తి నాస్తిబన్ధుస్సహోదరః
అర్థంనాస్తి గృహంనాస్తి తస్మాజ్జాగ్రత జాగ్రత॥

3 జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖం పునః పునః
సంసారసాగరం దుఃఖం. తస్మాజ్జాగ్రత జాగ్రత॥

4 కామక్రోధశ్చ లోభశ్చ దేహేతిష్ఠన్తి తస్కరాః
జ్ఞానరత్నాపహారాయ తస్మాజ్జాగ్రత జాగ్రత॥

5 ఆశయాబధ్యతేలోకః కర్మణా బహుచిన్తయా
ఆయుఃక్షీణం నజానాతి తస్మాజ్జాగ్రత జాగ్రత॥

6 సంపదస్స్వప్నసంకాశా యౌవనం కుసుమోపమమ్
విద్యుచ్చఞ్చలమాయుష్యం తస్మాజ్జాగ్రత జాగ్రత॥

7 క్షణంవిత్తం క్షణంచిత్తం క్షణంజీవితమావయోః
యమస్య కరుణానాస్తి తస్మాజ్జాగ్రత జాగ్రత।

8 యావత్కాలంభజేత్కర్మ తావత్తిష్ఠన్తిజన్తవః
తస్మిన్ క్షీణేవినశ్యన్తి కా తత్రపరిదేవనా॥

9 ఋణానుబన్ధరూపేణ పశుపత్నీ సుతాలయః
ఋణక్షయే క్షయంయాన్తి కా తత్రపరిదేవనా॥

10 పక్వాని తరుపర్ణాని పతన్తిక్రమశో యథా
తథైవ జన్తవః కాలే కా తత్రపరిదేవనా॥

11 ఏకవృక్షసమారూఢా నానాజాతి విహఙ్గమాః
ప్రభాతే విదిశోయాన్తి కాతత్రపరిదేవనా॥

12 ఇదంకాష్ఠమిదం కాష్ఠం నద్యాంవహాతి సంగతః
సంయోగాచ్చ వియోగాచ్చ కా తత్రపరిదేవనా॥

కోలారు ప్రకాశకులు,

16–3–1955 కోలారు ఆర్యవైశ్యగీతా సమాజము
కోలారు.



శ్రీ గురుభ్యో నమః



శ్రీ శ్రీ శ్రీ చిద్గగనానంద సద్గురు పరబ్రహ్మణేనమః

# శ్రీ శంకరాచార్య చరిత్ర తోహారగానం

## ప్రథమోఽధ్యాయః

శ్లో॥ నారాయణం బద్మభువం వసిష్ఠం ।
శక్తించ తత్పుత్రపరాశరంచ ।
వ్యాసం శుకం గౌడపదం మహాంతం ।
గోవింద యోగీంద్రమథాస్యశిష్యం ।
శ్రీ శంకరాచార్య మథాస్యపద్మ
పాదంచ హస్తామలకంచశిష్యం ।
తంత్రోటకం వార్తికకారమన్యా ।
నస్మద్గురూన్ సంతతమానతోస్మి ॥

శ్లో॥ శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణం
సూత్రభాష్యకృతౌవందే భగవంతౌ పునః పునః

1 శంకర శంకర శంకర శంకర
శంకర శంకర యనుమనసా
శంకర శంకర శంకర యనుచు
శంకర చరితము వినుమనసా

శ్రీ శంకరాచార్య స్తోత్రహారగానం

2 శంకరచరితము గానరూపముగ
పాడిన భక్తుల పాపములు
పటాపంచలై పోవునుగాన
గంభీరముగా పాడండి

3 రత్నగర్భయగు భారతభూమిలో
మహాత్ములెందరో పుట్టిరిగా
అట్టివారిలో శంకరగురుడే
ప్రతిభావంతుడె తెలియండీ

4 భగవాన్ స్వామి చిద్గగనానంద
మహర్షి కల్యాణపురమునకు
ఆహ్వానింపగబడి పాటలువిని
సులలితబోధని తెలిపిరిగా

5 పాదు సాంబశివస్వామిసన్నిధి
శిష్యమండలి ప్రేరణచే
ఈ ఉపాధిచే విన్నగురుండే
ఈ రీతిగను పాడించే

6 వేదాంతవిచారసభలో ప్రముఖులు
స్వామి సుబ్బయ్యశాస్త్రిలు
రామదాసులు బాగీర్తంమ్మ
భావార్తముల గ్రహించిరీ

7 ఈ చరిత్రమూ గానరూపముగ
శివరాంగు పత్త బాలునిచే
శంకర జయంతి ఉత్సవంబున
శంకర గురుడే వ్రాయించే

8 అంజనగురునీ ఆరాదనలో
వైశ్యులు ఆదరణంబునను
శాంతిగవినియు సంతోషించిరి
రెండవమారు ఈ చరితం

9 ఇట్టిచరిత్రము చింతామణిలో
మూడవమారు చెప్పబడే
వైశ్యబాలలు వైరాగ్యంబున
చరిత్ర శేవలో పాల్గొనిరి

10 నాల్గవమారు మంచేపల్లిలో
శంకరచరితమె గోరగను
నిఖిలానందుని వాగ్రుపమున
దేవిసన్నిధిని తెలుపబడె

11 బౌరింగ్ పేటలో భాగ్యవంతులగు
భక్తమండలీ కోరగనే
చంద్రమౌలీశుని సన్నిధిలోన
ఐదవమారూ ఈ చరితం

శ్రీ శంకరాచార్య తోహారగానం

12 కలియుగంబునా ఆదిభాగమున
ఆర్యావర్తదేశమున
చార్వాకమతము చాలగప్రభలి
నాస్తికత్వము ఏర్పడెను

13 చార్వాకమతము సిద్ధాంతంబు
స్వాతంత్రముండుట ముక్తి మని
జీవ్యాకింపుగా తినుటే స్వర్గము
కామభోగములు సుఖంబనీ

14 రామాయణమున ఈ మతంబును
జాబాలిమతమని పిలచెదరు
పూర్వపక్షమూ గ్రహించివీరు
సిద్ధాంతంబును వదలిరిగా

15 ఆసమయంబున బౌద్ధమతంబు
మహావ్యాకప్రక్రియన ప్రభలెనుగా
ఇలాంటి మతములు ఏర్పడగానే
దైవములేదని నుడివిరిగా

16 ఇట్టిసమయమున హార్భాగములు
పూర్ణంబుగను నిలచెనుగా
యజ్ఞములన్ని నిలచుటచేత
క్షామకాలము ఏర్పడెను

17 దుర్మతంబులు హెచ్చుటచేత
దేవతులందరు జేరియును
బ్రహ్మవద్దకు బయలుదేరియు
తాపత్రయముల జెల్పిరిగా

18 బ్రహ్మదేవుడు వేల్పులగాంచి
ఈ రీతిగను దెలిపెనుగా
కైలాసపతియగు శివుడేమనకు
అభయమిచ్చునని బల్కెనుగా ॥

19 ఇంద్రాదులను వెంటనిడుకొని
బ్రహ్మదేవుడు అరుదెంచి
శీఘ్రమె కైలాసంబును జేరి
శివుని స్తోత్రము జేసిరిగా ॥



## ద్వితీయోఽధ్యాయః

1 నీలకంఠ వృషభవాహనా
పార్వతీరమణ దక్షహరా
భక్తవత్సలా భవభయహరణా
కరుణాసాగర నమోస్తుతే

2 విధవిధంబులా ప్రార్తనజేయు
ఈశుడు సంతోషముజెంది
దేవతులందర నాదరించియు
వారిక్షేమముల ప్రశ్నించెగ॥

3 ఈ వాక్యముల వినిన అమరులు
మర్త్యలోకమతముల వివరించి
వేదోధ్ధారణ జేయవలెనని
వేల్పులు చాలావేడగనూ॥

4 కృతయుగంబునా ధర్మస్థాపనా
తనంతతానే జరిగెనుగా
త్రేతాయుగమున ఋషులచేతను
ద్వాపరంబునా రాజులచే ॥

5 కలియుగంబునా సంఘశక్తిచే
ధర్మము నిలుపగవలెగాన
మీారునాల్గురు శిష్యులునాతో
మర్త్యలోకమున బుట్టవలె

6 పరమేశ్వరుని మాటలువినియు
దేవతులెట్లా వొప్పిరిగా
అప్పుడు ఈశుడుఈరీతిగను
శాసనజేసెను వేల్పులకు

7 కుమార స్వామిప్రయాగంబున
బట్టపాదుడై జన్మించి
కర్మకాండ భాగంబులన్నియు
ఉద్ధరించుచు నుండవలె

8 బట్టపాదునకు సహాయంబుగా
మహిష్మతీ నగరంబునను
బ్రహ్మదేవుడు మండనమిశ్రుడై
అవతారంబు జేయవలె

9 బౌద్ధులరాజుగ ఇంద్రుడుగూడా
సుధన్వారాజుగ బుట్టియును
బౌద్ధమతంబు ఖండనజేసి
కర్మకాండము నిలుపవలె

10 విష్ణువుసంకర్షణ రూపుడుగా
పతంజలిగాను శేషుండు
వేదము రెండవభాగంబైన
దేవకాండము నిలుపవలె

11 నేనునుకూడ శంకరయతిగా
వుద్భవంబును జెందియును
నాల్గురుశిష్యులు శేవించగను
జ్ఞానకాండను నిలిపెదను

12 ఈరీతిగను అజ్ఞనుజేసిన
ఈశునివాక్యంబుల వినియు
దేవతులందరు అట్లొప్పి
స్వస్థానంబుల జేరిరిగా

13 ప్రయాగ పుణ్యక్షేత్రంబునను
భట్టపాదుడు జన్మించి
విద్యాభ్యాసము బాగుగజేసి
బౌద్ధగురువుల చేరెనుగా

14 బౌద్ధమతస్థుల అభిప్రాయముల
బాగుగ తెలసి ఖండించె
సుధన్వారాజు వద్దకుజేరియు
బౌద్ధవాదకు నిలచెనుగా

15 తొంబదివేలు బౌద్ధులకూడిన
సుధన్వారాజు సభలోన
భట్టపాదునకు మర్యాదివ్వగ
బౌద్ధులు అసూయజెందిరిగా

16 అసూయజెందిన బౌద్ధులగర్వము
భట్టపాదుడు అణచుటకై
సభకుముందు రవృక్షములోని
కోయిల కాకుల గావించియును

17 కోఖిలరాజము నీవుకాకుల
గుంపులువిడిచి ఉండినచో
ఎంతోనీకు సన్మానంబని
భట్టపాదుడు బల్కెనుగా

18 ఈమాటలను వినినబౌద్ధులు
మేమేకాకుల మనుకొనియు
సుధన్వారాజు కోయిలయనియు
వారికిఅన్యాయ మాయెనుగా

19 వెంటనెబౌద్ధులు ఈయర్థమును
సుధన్వారాజుకు వివరించి
నీవుబ్రాహ్మణ పక్షపాతుడవు
నీఆశ్రయము వలదనిరి

20 సుధన్వారాజు బౌద్ధులగాంచి
మాకుకోపము ఎందుకని
బ్రాహ్మణుడొచ్చిన కార్యార్థమును
ప్రశ్ననుచేయగ ఇట్లనియె

21 శాస్త్రవాదమున బౌద్ధులనందరి
ఖండనచేయగ వస్తినని
సుధన్వారాజు సంతసించియు
శాస్త్రవాదముకు ఏర్పాచె

22 శాస్త్రవాదమున బౌద్ధులుక్రమముగ
క్షీణము జెందుచునుండగనూ
రాజుఉభయుల గాంచుచునిట్లు
బల్కినవివరము వినరండి

23 పండితులారా మీరుభయులును
శాస్త్రవాదముల గర్జనలో
ఒకరికిఒకరు తక్కువలేదని
నాకగబడుచూ నున్నదిగా

24 జయాపజయములు నిర్ణయించుటకు
ఉపాయంబును దెల్పెదను
కొండనుండియు దుమికినవారే
జయశీలులని జెప్పెనుగా

25 భట్టపాదుడు సంతోషించి
కుదరమునుండి దుమికెనుగా
భట్టపాదుడు బాగుగనుండుట
బౌద్ధులుగాంచి ఇట్లనిరి

26 రాజశ్రేష్ఠ బ్రాహ్మణులందరు
ఇంద్రజాలకులు తెలియండి
చూచుటకేమో ఇట్లుగనపడె
ఇదంతనిజము కాదనిరి

27 సుధన్వారాజు ఆగ్రహించియు
బౌద్ధులతోడ ఇట్లనియె
రేపటిదినమూ పరిక్షించియు
గానుగకిచ్చెద పోలినచో

28 మరసటిదినము సుధన్వారాజు
పామునుకుండలో వేశియును
మూతమూసియు మోహరునుచేసి
ఏదిఉన్నదని ప్రశ్నించె

29 జ్యోతిశ్శాస్త్ర నిపుణబౌద్ధులు
అందులోసర్పము ఉన్నదన
దీనినివినియు సుధన్వారాజు
అశ్చర్యంబు జెందెనుగా

30 భట్టపాదుని చంపవలయునని
రాజుచాలగా యోచించి
వెంటనెధైర్యము పొందినవాడై
భట్టపాదుని ప్రశ్నించే

31 బౌద్ధులు ప్రశ్నను వినినవెంటనె
కోపముజెంది గర్జింప
సమాధానము చెప్పొచ్చురాజు
భట్టపాదుని అడిగెనుగా

32 సదూపచింతన భాగుగచేసి
భట్టపాదుడు బల్కెనుగా
ఇందులో సర్పము లేదుమంగళ
విష్ణువిగ్రహము ఉన్నదనె

33 భట్టపాదుని మాటలువినియు
బౌద్ధులుపకపక నవ్వియును
విష్ణువిగ్రహము తీసిఇవ్వమని
బౌద్ధులుదృఢముగ బల్కిరిగా

34 భట్టపాదుడు భయమునువదలి
చిన్మయరూపమును ధ్యానించి
ఆవరణంబగు బట్టనుతీసి
విష్ణువిగ్రహము చూపెనుగా

35 సుధన్వరాజు సంతోషంబుకు
పారమెలేక ఉండెనుగా
బౌద్ధులముఖములు వాడిపోవగా
అంతర్వాణి ఇటుబల్కె

36 ప్రమాణంబులు వేదంబులుగా
భట్టపాదుని కాపాడు
వేదనిందక బౌద్ధులనందరి
నిగ్రహించుమ బల్కెనుగా

37 సుధన్వారాజు పూర్వప్రతిజ్ఞచే
చంపుటకష్టము పడకుండు
వైదిక ద్రోహులగు బౌద్ధులనందరి
దేశబహిష్కుల చేసెనుగా

37 ఆసమయంబున బౌద్ధులందరూ
దీపాంతరమున చేరిరిగా
నాస్తికమతము తగ్గిపోయెగా
కర్మమార్గము నిలచెనుగా

39 నాల్గువర్ణములు కర్మమార్గముల
శాస్త్రోక్తంబుగ నిలపుటకు
పతంజలీ సంరక్షణులిద్దరు
దేవకాండమును నిలిపిరిగా

40 జ్ఞానకాండమును ఉద్ధరించుటకు
కైలాసంబున ఈశుండు
భూలోకములో అవతరించుటకు
స్థళము వెదనిఊహించె



37 సుధన్వారాజు పూర్వప్రతిజ్ఞచే
చంపుటకష్టము పడకుండు
దైవద్రోహులగు బౌద్ధులనందరి
దేశబహిష్కుల చేసెనుగా

37 ఆసమయంబున బౌద్ధులందరూ
దీపాంతరమున చేరిరిగా
నాస్తికమతము తగ్గిపోయెగా
కర్మమార్గము నిలచెనుగా

39 నాల్గువర్ణములు కర్మమార్గముల
శాస్త్రోక్తంబుగ నిలపుటకు
వతంజలీ సంరక్షణులిద్దరు
దేవకాండమును నిలిపిరిగా

40 జ్ఞానకాండమును ఉద్దరించుటకు
కైలాసంబున ఈశుండు
భూలోకములో అవతరించుటకు
స్థళము ఏదనిఊహించె



6 పుత్రహీనత చింతనచేత
వృషభాచలము చేరియును
పరమేశ్వరుని ప్రార్థనచేయగ
ఈశుడుఅను గ్రహించెనుగా

7 వెంటనెభార్య గర్భముదాల్చి
నవమాసంబులు నిండెనుగా
శుభముహూర్తమున పుత్రుడుపుట్టగ
శివగురుండని పేరిడిరి

8 శివగురబాలుడు చంద్రునిరీతిగ
వృద్ధిబొందుచూ నుండెనుగా
ఐదవఏట ఉపనయనంబు
శాస్త్రోక్తముగా జేసిరిగా

9 పండ్రెండేడ్లలో గురూపవాసము
అందునవే దాధ్యయనంబు
గురువులఆజ్ఞను తప్పకనడచుచు
దేశాటనకు వెళ్ళెనుగా

10 దేశాటనలో కాశియాత్ర
ముగించుకొని గురుసన్నిదికి
చేరియుండగా విద్యారాజు
శివగురుని వివాహామనిజెప్పె

11 వివాహావిషయము శివగురుడినియు
భయోత్పాతము వలదనగా
గురువరుడంతా శివగురుడప్పుడు
వివాహంబుకు ఒప్పుకొనె

12 జ్ఞానముబొందుట వ్యక్తిలక్షము
కర్మసాధనమే జ్ఞానంబు
గృహస్థాశ్రమము కర్మసాధనము
ఐదువిధంబుల దీరునుగా

13 బ్రహ్మచర్యమున రెండురుణంబులు
పితృల అతిథుల భూతములా
ఐదువిధంబుల రుణముతీరగా
నులని తేపాల్ దోలగునుగా

14 ధనముముఖ్యము ఈఆశ్రమున
ధనమునసేవ యాచనగా
సేవావృత్తి శునమువంటిది
అవమానంచె యాచనగా

15 కర్మములోపము జరుగగూడదు
కర్మచరము కష్టముగా
సక్రమకర్మకు ధనముకావలె
అందున కష్టము యనినుడివె

16 గురువుల ఆజ్ఞచె శివగురుడపుడు
 వివాహంబున ఒప్పుకొనె
వెంటనె విద్యారాజు తిరుగుచు
 మహీపండితుని చేరగను

17 మరీపండితుని పుత్రికయును
 ఆర్యాంబప్పుడు ఒప్పుకొనె
వెంటనెబంధువు లందరుజేరి
 వివాహంబును జరిపిరిగా

18 పెండ్లికూతురకు తండ్రిచాలగా
 స్త్రీధర్మంబుల తెల్పియును
అత్తమామల సేవచేయుమని
 అగ్రహారముకు బంపెనుగా

19 శివగురుండు సంసారములో
 స్వర్గసుఖంబును బొందుచునూ
భార్యభక్తిచె ఆనందములో
 గృహస్తదర్మాల్ నడిపెనుగా

20 ఇంట్లుండగనూ పుత్రులులేక
 తనకుగల్గిన కోరికను
ఏకాంతములో భార్యకుచెప్పగ
 భార్యధర్మముల దెలిపెనుగా

21 సాధ్వీమణిచే బోధితుడై య్యా
వృషభాచలమున శివగురుడు
ప్రయాణమయ్యె పరమేశ్వరుని
పరిపరివిధముల ప్రార్థింప

22 స్వప్నములోన పరమేశ్వరుడు
రెండువరంబులు ఇత్తునని
అల్పవయస్సు మేధావంతుడు
ఒక్కబాలుడు కావలెనా

23 దీర్ఘాయువులు మూర్ఖపుత్రులు
ఎందరినైన కోరుమన
శివగురుడపుడు స్వప్నములోన
మేధావంతుని కోరెనుగా

24 పరమేశ్వరుడు అట్లేకానని
అంతర్ధానము జెందెనుగా
అంతలోనె అంతర్వాణి
పరమేశ్వరుడె పుట్టునని

25 వెంటనెవారు ఉప్పొంగుచునూ
స్వగ్రామంబును చేరగనె
ఆర్యాంబపుడు గర్భముదాల్చగ
శివతేజస్సు నిలచెనుగా

26 శివగురుండు భార్యనుగాంచి
చాలానుబ్బుచు నుండెనుగా
ఇట్లుండగనూ కలియుగంబున
ఆదిభాగమున జన్మించె

27 వైశాఖ శుద్ధ పంచమిదినము
మృగశిర వృషభలగ్నమున
సూర్యఅంగారక శనిగ్రహంబులు
ఉచ్చస్థానము చేరుండ

28 లగ్నముపడవ కేంద్రములోన
గురువులగ్నములో నుండగనూ
ఆర్యాంబపుత్రుని సుఖంబుగాను
విచిత్రంబుగా ప్రసవించె

29 పుత్రుడుపుట్టిన సంగతి తెలసి
సచీలస్నానము చేసియును
జాతకర్మము చేసినవెంటనె
షోడశదానాల్ చేసెనుగా

30 కాలటిలోన బ్రాహ్మణస్త్రీలు
ప్రతినిత్యంబు వచ్చియును
శిశువునుముట్టి సంతోషించి
పరవశత్వమును జెందుచునూ

31 మంగళస్నాన దినంబునందు
విద్యుక్తంబుగ ముత్తైదుల్
స్నానము వేడుక చేయించగను
నామకర్ణముకు మొదలిడిరి

32 సభికులందరూ ఏకకంఠమున
శంకరనామము పెట్టుడన
అందరికిట్లు నిర్ణయమాయె
ఈవాక్యములు వినరండి

33 రామకృష్ణుల రీతిగనితడు
లోకదుఃఖముల బాపునుగా
జనులందరికీ సుఖమిచ్చుటచె
శంకరుడనియె పేరిడిరి

34 శంకరపదము అక్షరాల్ బట్టి
వైశాఖ శుద్ధ పంచమిగా
ఎంతోగంభీరంబును బట్టి
శంకరనామమే నిర్ణయము



## చతుర్థోధ్యాయః

1 శంకరబాలుడు బాలలీలలో
మాతాపితృుల మరగించె
ఆర్యాంబా ఒక దినంబునందు
శిశువుని తొడపై జూడగను

2 బాలునిముఖమున ఫాలభాగమున
మూడవనేత్రము గుర్తుండె
తలపై చంద్రుని రేఖగుర్తును
కంఠమునల్లగ కనుపించె

3 చేతులలోన శంఖుచక్రముల్
శూలడమరుగము చిన్హములు
ఈగుర్తులను గాంచగతల్లికి
హరిహరరూపుడు యనితెలిసె

4 శంకరబాలుడు మరియొకదినము
తొట్లలోగట్టిగ ఏడ్వగనూ
తల్లిఏమని చూడగశిశువుకు
పాములుచుట్టు కొనుండెనుగా

5 ఈదృశ్యమును చూచినతల్లి
విషముచే శిశువుచచ్చునని
భయంబుచేత భర్తకు తెలుపగ
భర్త చూడ పాములులేవు

6 శివగురుడప్పుడు భార్యనుగాంచి
అద్వైత్యపడకని చెప్పియును
సాక్షాత్ శివుడె ఈబాలుండని
తెలియుము అబలాయనిబల్కె

7 శంకరుడిట్లు బాల్యమునందే
లీలలుచూపుచు నుండగనూ
సత్యలోకమున బ్రహ్మదేవుడు
ఋషివరులందరి రప్పించి

8 సత్యలోకమున ఋషిలందరుచే
వేదాధ్యయనము జరుగగను
వారిసేవనుచేయుచు భారతి
అధ్యయనంబును గమనించె

9 దూర్వాసమహర్షి అధ్యయనంబున
స్వరలోపంబును గమనించి
ఓఋషులారా స్వరలోపంబని
పక్కననవ్వుచు నుండగనూ

10 దూర్వాసమహర్షి కోపముజెంది
స్త్రీకి ధర్మము గాదనియు
భూలోకంబున మానవస్త్రీగా
అవతరించుమని శపించెను

11 స్వామితమారే ఇట్లుబల్కుట
వుచితముగాదని జెప్పియును
అయిననుగాని శాపవిమోచన
ఎప్పుడుదెల్పుడు యనివేడె

12 పరమేశ్వరుడె శంకరుడయ్యి
భూలోకములో బుట్టునుగా
అతని దర్శనంబుననూ నీకు
శాపవిమోచన యనిపల్కె

13 అదేరీతిగా భారతదేవి
శోణభద్రనది తీరమున
విష్ణుమిశ్ర భట్టాచార్యుల
పుత్రికగాను జన్మించె

14 ఈపుత్రికకూ వుభయ భారతని
మాతాపిత్రులు పేరిడగా
ఈపుత్రికబలు జాణతనంబున
వివాహవయస్సు కొందగెనుగా

15 సరసవాణి వివాహంబుకై
తండ్రికియోచన హెచ్చెనుగా
ఈసమయంబున మహీష్మతీపుర
మండనమిశ్రుడు గోరెనుగా

16 విప్రులచేత వీ రుభయులకు
వివాహకార్యము నిర్ణయము
బంధుబళగము జేరియుండగ
వైభవంబుగా పెండ్లాయె

17 ఐదుదినంబులు ఉత్సాహంబున
పావన హోమములు జరిగెనుగా
హారతి అక్షంతుల చేతాను
ఊరేగింపు జరిగెనుగా

18 నాల్గువర్ణములవార్లకు విందులు
యోగ్యంబైన మర్యాదుల్
వితరణగానూ వివాహంబు
ఎంతో వేడుకజరిగెనుగా

19 పిమ్మట సరసవాణి తండ్రియగు
విష్ణుమిశ్ర భట్టాచార్యల్
స్త్రీధర్మంబులు బోధనజేసి
మహాత్మునికి పంపించె

20 మాత్రుదేవివలె అత్తనుగాంచుచు
వందనచేసిన గురుపనుచు
పతితనుసారంబుగ నెప్పుడును
కనుసైగులతో వెలుగువలె

21 వ్యాపారమునకు దనమురీతిగా
జగదీశ్వరునకు శ్రీధర్మం
ఇదెఈశుని సంకల్పంబు
శ్రీలకులజ్జ భూషణము

22 గృహాస్వతంత్రము శ్రీలకు హక్కు—
వెలుపల వ్యవహారమువలదు
పశిసుతలపోషణయే ముఖ్యము
సస్సంతానమే కారణము

23 వీదులవెంబడి తిరుగుచునుండేది
నాటకంబుల నటించిన
పురుషులందరు శ్రీలుకావలె
శ్రీకి స్వతంత్రము లేదనరి

24 శ్రీపురుషులకు అంగభేదములు
వ్యత్యాసంబులు లేవనిన
ఈశ్వరరచన తప్పిపోవునూ
నియమితపనులే చేయవలె

25 యజ్ఞయాగముల గౌరీవ్రతములు
జప తప ఉపవాసంబులును
వీటినిజేసి పతినిమీరిన
(4) నరకమచ్చుననే రాముండు

ఎట్టిగుణంబులు గల్గినగాని
పతిపూజనమే జేయవలె
మంచిగృహిణి ఉండినగృహమున
వేల్పులుతీర్థము లుండునుగా

37 సీతా ద్రౌపతి సావిత్రి శీలములు
దమయంతి చంద్రమతి కష్టముల్
యుగాంతరంబుల ధర్మాల్ జెప్పి
కీర్తి బొందమని జెప్పెనుగా

38 ఉభయభారతి అత్తింటికిజని
స్త్రీలలోతిలక ప్రాయముల
విద్యార్థులను అభ్యాగతులను
చాలసేవించుచు నుండె



పంచమోధ్యాయః

1. కాలటి అగ్రహారములోన
ఒకపడాది శిశువునకు
స్వప్నములోన బృహస్పతిగురుడు
చార్వాకరహస్యాల్ దెల్పెనుగా

2 మరిఒకదినమూ స్వప్నములోన
అద్వైతరహస్యాల్ కృష్ణునిచే
తెలసిజప్తిలోనుంచు కొనుండగ
రెండువత్సరాల్ నిండెనుగా

3 వేదాధ్యయనము చేయుటకంటె
పూర్వమె సమస్తశాస్త్రములు
తానే స్వయమున నేర్చినవాడై
ప్రతిభాశక్తిని జూపెనుగా

4 ఈవయస్సుకె ఇంతటిశక్తి
ఎట్లుగల్గెనని శ్రోతులకు
సంశయంబు గల్గునుగాన
శ్రోతులువీటిని వినరండి

5 సామాన్యబుద్ధికి హెచ్చగుబుద్ధికి
మేధాయనియు నామంబు
సర్వోత్కృష్టంబగు బుద్ధికిని
ప్రతిభాయనియు పేరుండు

6 ఇట్టివ్యక్తులు కాలాంతరమున
దేశాంతరమున బుట్టుదురు
భారతీయులకు జన్మతవచ్చును
దృష్టాంతంబులు వినరండి

7 కాలినామము ఇంగ్లీష్కవియూ
అద్వితీయకవి పదేండ్లకు
ఫ్రాన్సుదేశము టగోనామడు
విద్వాంసుడు తొమ్మిదిఏండ్లకు

8 నాల్గు ఏండ్లకు డాక్టర్ తమిాస్సు
ఏసుచరిత్ర తిద్దెనుగా
కోల్రిడ్జరు ఇంగ్లీష్కవియుకు
పదహారేండ్లకె ప్రవీనుడు

9 జాన్స్వటుడు మూడవఏటున
గ్రీక్ భాషను కలిసియును
పదహైదేడ్లలో గణితశాస్త్రముచె
ఆఫీస్పనియూ చేసెనుగా

10 పదినెలలోన క్రిచ్చ్యన్ ఇన్కర్
మాటలునేర్చుగ మాట్లాడి
ఒకవత్సరముకు బైబల్ చదవి
రెండవఏటున చర్చించెన్

11 ఎందరెందరో ఈరీతిగను
చేసివుండగ శంకరుడు
ఇట్టిప్రతిభను పొందుటలోన
ఆశ్చర్యంబు లేదండి

12 ఇట్టిలీలలు చూపుచునుండగ
శంకరశిశువుని గాంచియును
అల్పవయస్సును తలచుచుతండ్రి
చింతనచేయుచు నుండెనుగా

13 ఇట్లుండగను ఒకదినంబున
శిశువుజాతకము జూపించి
పుత్రుని మూడవ సంవత్సరమున
తనకుమరణమని తెలిసెనుగా

14 శివగురుడపుడు భార్యనుగాంచి
తనమరణంబును తెలిపియును
నీవుధైర్యము నవలంభించి
శిశువును బాగుగజూడుమనె

15 అశ్రద్ధచేయక నుండవలయునని
చాలగభోధన జేసియును
బాలునిమూడవ సంవత్సరమున
శివగురుడిడచే దేహామును

16 భర్తవియోగము భరించలేక
ఆర్యాంబపుడు దుఃఖింప
శంకరబాలుడు మాతనుగాంచి
జ్ఞానభోధను భోదించె

17 బాలునిబోధను తల్లికిబాగుగ
తెలసి అర్థంబాయెనుగా
వైదవ్యమును అనుభవించుటకు
తనభావంబును ప్రకటించె

18 శంకరబాలుడు కర్మసూత్రమును
నేర్పుమాటలతో వివరింప
ఆర్యాంబపుడు భర్తశరీరము
సంస్కారంబు చేయించె

19 పిమ్మటభర్తకు కర్మభాగములు
క్రమంబుగనూ చేయించి
శంకరచతురత చింతనచేసి
తల్లికాలము గడుపగనూ

20 శంకరబాలుని ఐదవఏటున
శాస్త్రోక్తంబుగ ఉపనయనం
చేయగబాలుడు గురువునుగాంచి
ఇట్లుప్రశ్నను చేసెనుగా

21 ప్రాణాయామం బనగానేమి
గాయిత్రికి అర్థంబేమనియు
అజనదండ కౌపీనంబులను
ఉపవీతార్థము ఏమనియు

22 అర్ఘ్యంబెందుకు ఇవ్వావలయును
ఎట్టినియమముల నడుపవలె
వీటిఅర్థములు వివరింపుమని
గురుని శంకరుడు వేడెనుగా

23 గురుడుశంకరుని చతురతగాంచి
వినుముబాలకయని బల్కె
పుట్టుకచేత అందరుశూద్రులు
ఇట్లుచేసిన బ్రాహ్మణులు

24 బ్రాహ్మణయోనిలో పుట్టుట ఒకటి
తపస్సుచేయుట రెండవది
వేదాధ్యయనము మూడవదగును
మూటిచే బ్రాహ్మణుడగుగాక

25 బ్రహ్మచర్యము ప్రథమసాధన
అందున సంధ్యావందనము
నాల్గుసాధనలు సంధ్యకూడియు
అంతయు అంతర్యాభతములు

26 కర్మస్వరూపము మార్జన క్రియయు
భక్తియె నామస్మరణంబు
ప్రాణాయామము యోగంబగును
తత్వార్థంబె గాయత్రి

27 తత్త్వార్థంబున వేదశాస్త్రములు
తెలవిజ్ఞానము జెందుటయు
ప్రపంచమునకూ భిన్నంబుగనూ
ఉండుటసత్తును గాంచుటయె

28 కర్మభక్తియోగంబులకు
అర్థంబులను తెలపియును
గాయిత్రీ జప తత్త్వార్థంబు
విషదంబుగనూ తెలిపెనుగా

29 తొమ్మిది పోగులు మూడు సూత్రములు
ఇరవై ఏడుతో గూడినది
యజ్ఞోపవీతంబగునూ దానిని
ఉపనిశత్తులు తెల్పెనుగా

30 మూడుదేహములు ఆవరణంబుగ
ఆత్మను ఆచ్ఛాదించినవి
పంచభూతములు పంచకోశములు
పంచప్రాణములు గూడియును

31 ఐదువాయువులు జ్ఞానేంద్రియములు
కర్మేంద్రియములు గూడియును
జీవపరమాత్మలకు ఇరువదిఏడు
చేరినభాగము తెలుపునుగా

32 మూడుచేరుట మూర్తిత్రయము
అకారఉకార మకారముల్
గుణత్రయంబున సృష్టిత్రయము
వీటిఅర్థమె గాయిత్రి

33 ఇట్టినియమముల పాలించుచును
బ్రహ్మచర్యమున శంకరుడు
పండెండేండ్లలో గురుకులంబున
అటుపై గృహస్త ధర్మములు

34 వీటివివరములు వినినశంకరుడు
నియమంబులను జరుపుచును
బిక్షాటనకై శంకరుడంతా
బ్రాహ్మణఇంటికి వెడలెనుగా

35 వెళ్ళిశంకరుడు ఇంటిముందుర
బిక్షాందేహి యనిబల్కె
అపుడు బ్రాహ్మణి యింటిలోవెదుకగ
తనపతి ఏమి తేకుండె

36 ఖిన్నమనస్సుతో బ్రాహ్మణి స్త్రీయు
ఏమితోచక నిలబడెను
మాటిమాటికి శంకరవటువు
భిక్షాందేహి యనిబల్కె

37 అగృహిణి ఈమాటలువినియు
వంటలేదని బల్కెనుగా
ఈమాటలను శంకరుడినియు
నవ్వుచునిట్లు బల్కెనుగా

38 తల్లినీవు మొదటనెచెప్పక
సావకాశము చేసితివి
ఇంతప్రొద్దుకు ఎన్నోఇండ్లకు
పోయివుందును తెలియమ్మా

39 అందునసీవు ఇంటిలోవుండెడి
ఏదైనను యిమ్మని అడుగగను
ఏమియుతోచక ఇంటిలోవెదుకగ
అమలకంబు దొరికెనుగా

40 అమలకంబు చేతిలోనిడుకొని
కన్నులోనీరు గార్చుచును
స్తబ్దంబుగనూ నిలబడగానె
అనుగ్రహించె శంకరుడు

41 లక్ష్మిదేవిని ప్రార్థనచేసి
దానిని శంకరు డిమ్మనగా
దైన్యంబుగనూ సాధ్వీమణియు
ఉసిరికకాయను వేసెనుగా

42 వెంటనేగాయిత్రిని పఠియింపగనె
ప్రత్యక్షంబుగ లక్ష్మియును
ఎదుటకనబడి శంకరుగాంచగా
ఈమె దరిద్రము దీర్చుమనె

43 లక్ష్మిదేవిని శంకరుడపుడు
ధనమిమ్మని బహుప్రార్థింప
బదులుచెప్పక లక్ష్మిదేవి
సువర్ణఆమలకాల్ ఇచ్చెనుగా

44 పూర్ణానదికి స్నానంబునకై
ఆర్యాంబవెళ్ళుచు నుండెనుగా
స్నానంబాడి వచ్చుటతల్లికి
కష్టంబని వటుబల్కెనుగా

45 అమ్మానీవు స్నానంబునకై
ఇకపై నదికి పోవలదు
ఇంటిలోస్నానము చేయుచుండుమని
తల్లినిప్రార్థన జేయగను

46 శంకరవినుమా భాగీరతికీ
సమానమైన ఈనదిలో
స్నానంబాడక ఉండుటనాకు
మనస్సు ఒప్పాట లేదనియే

47 తల్లిభక్తినిగాంచి శంకరుడు
గాయిత్రిని జపియించియును
పూర్ణానదినీ ప్రార్థించగను
ఇంటిముందర ప్రవహించె

48 ఇట్టిశక్తిని తెలసినరాజు
ఆశ్చర్యంబు జెందియును
ఇట్టిమహాత్ములు ఉండుటచేత
నేనుధన్యుడ యనుకొనియు

49 వారిపాదము మనభవనంబులో
పడినపవిత్ర గల్గునని
వటువును రప్పించుటకై రాజు
మంత్రికిఆజ్ఞను చేసెనుగా

50 మంత్రియుచేరెను అగ్రహారము
శంకరుగాంచి వివరింప
దీనినివినిన శంకరుడంతా
మంత్రివరునితో ఇటుబల్కె

51 విశ్వాసంబు రాజుకుండుట
మాకు సంతోషంబెగాని
ఏకాంతంబున కాలముగడుపు
మాకునురాజుకు పొసగదుగా

52 మేమువచ్చుట ఋణముపడెదము
ప్రజలకు ద్రవ్యముఖర్చగును
ప్రజలకు మేము ఋణముపడుటచె
పాపహేతువుకు పాత్రులుగా

53 ఈమాటలను వినినవెంటనె
మంత్రిరాజుతో చేరియును
శంకరవపుటుని ఇష్టము తెలుపగ
అగ్రహారముకు రాజుచనెగా

54 శంకరునొద్దకు రాజువెడలియు
నాటక గ్రంథంబుల చదివి
ఉపదేశంబును పొందియురాజు
కానుకలిచ్చి వెడలెనుగా

55 పదివేలువరహాల్ శంకరుడంతా
అగ్రహారముకు ఇచ్చియును
నాటకంబుల పరిశీలించి
కీర్తిప్రతిష్ఠలు పొందెనుగా



## షష్ఠోధ్యాయః

1 శంకరబ్రహ్మ చారులమహిమ
లోకవిఖ్యాతి జెందగనూ
శంకరదర్శన భాగ్యముగోరి
దూర్వాసులు అరుదెంచియును

2 దుర్వాసమహర్షి అరుదెంచగనే
అగస్త్య గౌతమ దదీచియు
కాలటిఅగ్రహారము చేరగ
ఆర్యాంబసంతసము జెందియును

3 కలియుగంబున మహాత్ములారా
మీరరుదెంచుట పుణ్యమని
వినయంబుగనూ ఈ రీతనెను
మహాత్ములారా నా మనవి

4 వృద్ధాప్యంబు గల్గుటచేత
గృహకార్యములకు సామర్థ్యం
తగ్గుటచేత యోచనచేసితి
దానికిసలహా ఇవ్వవలెనే

5 నా కొమారునికి ఎనిమిదిఏండ్లు
నిండియున్నది ఇకముందు
అనుకూలవతియగు కన్యకదొరకునో
వివాహ యోచన చేయవలెనే

6 ఆర్యాంబను చూచి అగస్త్యఋషియు
జాతకంబును అడిగెనుగా
జాతకంబునుచూచి అగస్త్యులు
ఆయుర్దాయము తెలుసుకొని

7 అమ్మా ఇతనికి ఆయుర్దాయము
ఎనిమిది ఏండ్లకు ముగియునుగా
సన్యాసంబును స్వీకరించిన
ఎనిమిదిఏండ్లు హెచ్చునని

8 కర్ణకటోరంబగు మాటలను
వినగ మూర్ఛను జెందెనుగా
శంకరు డుపచారంబునుచేసి
సమాదానము చేసెనుగా

9 అగస్త్యమాటలు జ్ఞప్తిచేసుకొని
గట్టిగరోదనచేసెనుగా
రోదనచేసెడి తల్లినిగాంచి
విధవిధబోధలు జేయగునూ

10 శంకరుమాటలు వినగతల్లికి
కొంతశాంతము గల్గెనుగా
మరుసటిదినమె ఆశ్వీజ శుద్ద
పౌర్ణమిదినమై వుండెనుగా

11 స్నానముకొరకై నదిలో దిగగా
నదిలో నక్రముపట్టుకొనె
మకరిబట్టుకొనె శంకరవటువును
గట్టిగరోదన చేసెనుగా

12 రోదనవినగా తల్లి భయపడి
పూర్ణానదిలో జూడగను
తల్లినిగాంచి శంకరబాలుడు
మరలగట్టిగా ఏడ్చెయును

13 అమ్మానన్ను మొసలి మ్రింగును
సన్యాసంబుకు ఆజ్ఞడుమా
నీవుఆజ్ఞను ఇవ్వక పోయిన
తప్పక నక్రము మ్రింగుననె

14 సన్యాసైన మకరివిడచును
లేనియెడల దుర్మరణామనె
ప్రాణంబుండిన చాలుననియును
సన్యాసమునకు ఒప్పెనుగా

15 తల్లిఆజ్ఞనుపొంది శంకరుడు
త్వరితసన్యాసము పొందెనుగా
మకరిశాపము తొలుగుటచేత
గంధర్వుండు ఆయెనుగా

16 పుష్పరతుండను గంధర్వుండు
శంకరస్తోత్రము చేసియును
దుర్మతంబులు ఖండ్రించు స్వామియని
తనలోకముకు వెడలెనుగా

17 సన్యాసంబును స్వీకరించిన
శంకరవటువు ఇటుబల్కె
శైవులు శివుడని బల్కుచుండెదరు
బ్రహ్మంబని వేదాంతులుగా

18 బౌద్ధులు బుద్ధుండని బల్కెదరు
కర్తుండనిన్యాయ శాస్త్రజ్ఞుల్
అర్హుంతుండని జైనులనెదరు
కర్మండని మీమాంసకులు

19 విశ్వమంతయూ నిండినదేదో
అట్టిబ్రహ్మమును ప్రార్థించి
తల్లి నేను ఇంటికిరానిక
దేవాలయములో ఉండెదను

20 తల్లిచాలగ వ్యసనముజెంది
ఇంటిలోఉంటూ వనికోనియు
సన్యాసముకు ఆజ్ఞ ఇచ్చితి
ఇకనాగతి ఏమనిఏడ్చె

21 ఇట్టిమాటలను వినినశంకరుడు
ఎవరికివారె దిక్కనియూ
గీతావచవచనము బాగుగదెల్పి
జననిదుఃఖము బాపెనుగా

22 పుత్రవ్యామోహంబును విడువక
తల్లికోరిక దెల్పెనుగా
అంత్యకాలమున సంస్కారంబు
నీచేతులతో జేయుడనె

23 తల్లినీవు స్మరించినంతనె
ఏదేశములో ఉండిననూ
నీసమీపమునకు నే నరుదెంచి
సంస్కారంబు చేతుననె

24 పిత్రార్జితమగు ధనంబునంతయు
ఆప్తజనులకు ఒప్పించి
బంధుపోషణాలో తల్లినివదలి
కృష్ణాలయమున నిలచెనుగా

25 శంకరవిషయము తెలిసినవిప్రులు
గుంపులు గుంపులు అరుదెంచి
సన్యాసంబు తగనిపనియని
దూషణచేసిరి బహువిధముల్

26 జితేంద్రియత్వము వైరాగ్యంబు
సన్యాసులకు ముఖ్యంబు
కలియుగంబున సన్యాసంబు
సిద్ధిపొందదని బల్కెరిగా

27 ప్రబలంబైన శ్రుతిప్రమాణములు
శంకరగురుడు వాదించి
సన్యాసప్రతిష్ఠాయను గ్రంథంబులను
వ్రాసిప్రతిభను చూపెనుగా

28 శంకరగురుడు క్రమసన్యాసము
పొందుటకొరకు యోచించి
గురుదేవుండు ఎక్కడుండునని
చింతనచేయుచు నుండెనుగా

29 శ్రీకృష్ణుండు శంకరయతికి
స్వప్నములోన ఇటుబల్కె
నర్మదానదీతీర భాగమున
ప్రవాళద్వీపం బొకటుండు

30 ఆద్వీపంబున పర్వతగృహాలో
గోవింద భగవత్పాదులును
తపస్సుచేయుచు నుందురుగాన
వారలవద్దకు పొమ్మనెను

31 ప్రయాణమగుటకు మొదలేనీవు
ఈపనిజేసి వెడలవలె
పూర్ణానదికి చలించుచుండెడి
కృష్ణవిగ్రహము గనుగొనియు

32 మరియొకచోట ప్రతిష్ఠించుమని
శంకరుడిట్లు జేసియును
ఉత్తరదిక్కుకు పాదచారిగా
వెడలినర్మదానది చేరెనుగా

33 నదిలోస్నానము చేయుచుండెడి
ఋషులనుగాంచి శంకరుండు
తానునుస్నానము చేసిఒడ్డున
నిష్ఠలోకూర్చొని యుండెనుగా

34 ఇచ్చటగురువులు ఉందురనియును
అంతర్వాణి బల్కెనుగా
శబ్దముతోచిన దిక్కుగాంచి
శంకరుడట్లు వెడలెనుగా

35 కొంతదూరము నడువగప్రవాళ
ద్వీపముపర్వత మగపడియె
పర్వతమెక్కి సిద్ధగవికిపోగ
ద్వారంబున ఒకవిచిత్రము

36 ద్వారముముందుర మహాపురుషుని
కాళ్ళుమాత్రమే అగపడియు
శరీరమంత గవిలోఉండుట
చూచిగురుడు ఇతడనుకొనెను

37 శంకరుడపుడు కారుపండ్లును
చేతులలోన నుంచుకొని
నమస్కరించి స్తోత్రముచేయగ
గురువుబహిర్యా డాయెనుగా

38 ఓయీశిశ్య నీ వెవరనియు
గోవిందగురువు ప్రశ్నించె
శంకరుడపుడు వినయంబుగను
భక్తితోయిట్లు బల్కెనుగా

39 పంచభూతంబులునూ కాను
గుణంబు లింద్రియములుగాను
వీటికి విలక్షణం బైనట్టి
సచ్చిదానందము నే ననెను

40 ఈఉత్తరముకు నంతోషించి
బహిర్భాగమున గనపడియు
శంకరుగాంచి సర్వజ్ఞుండని
గురువుకుతోచి యిట్లనెను

41 నీవుత్తరమున సర్వజ్ఞుండవు
లోకఅజ్ఞతను బాపుటకు
గురుశిష్యాన్యాయము చూపించుటకై
వచ్చినట్లుగ తోచినది

42 నిన్నుగురువుగ భావించుటకై
వచ్చితి మహాత్మయనిబల్కి
నాల్గువాక్యములు ఉపదేశించి
క్రమసన్యాసం బిచ్చెనుగా

43 క్రమసన్యాసము స్వీకరించియు
గురుసేవా తత్పరుడైయ్యా
గురుపరంపరను ప్రశ్నించగనూ
గురుపరంపర తెలిసియును

44 చంద్రమౌళేశుని లింగంబొకటి
రత్నగర్భమున గణపతిని
శంకరచేతిలో వుంచిగురుండు
పూజావిధిని తెలిపియును

45 మార్పులుగలిగె ప్రపంచంబున
వైరాగ్యంబె నీకనియు
సంసారములో గృహకృత్యములు
మర్మంబులను తెలిపియును

46 కృష్ణుడుభోగి శుకుడుత్యాగి
రాజులు రామజనకులును
కర్మనిష్ఠత నిర్లిప్తంబున
వశిష్ఠఋషియు వుండెనుగా

47 మరలశంకరుడు సన్యాసిధర్మముల్
గురువుని ప్రశ్నసుచేయగనూ
గోవిందగురుడు శంకరయతికి
సన్యాసిధర్మాల్ దెల్పెనుగా

48 గురువచనంబుల గమనించుచునూ
వారిఅనుగ్రహాము పొంది
రెండువత్సరాల్ సేవనుచేయుచు
వ్రాసినగ్రంధాల్ వినరండి

49 సాధనపంచక యతిపంచకము
ప్రాతస్మరణ పంచీకరణంబు
నిర్వాణదశకము ఆత్మవివేకము
వివేకచూడామణి గ్రింధాల్

50 ఒకసమయంబు అతివర్షముచే
నర్మదానది ఉప్పొంగి
తీరములోన ఆశ్రిమములపై
ప్రవహించుటచే భయపడియు

51 గుంపుగఋషులు గోవింద గురుని
చేరి అవస్థల తెలుపగనూ
శంకరవటువు రమ్మనిపిలువగ
లెక్కించక బల్కుచు నుండిరిగా

52 పదివత్సరముల శంకరబాలుడు
కొందరుఋషులను పిలచుకొని
తీరముచేరి అభిమంత్రించి
కమండలంబును బట్టుకొని

53 కమండలంబు లోనికినపుడు
ప్రవాహమంత పోయెనుగా
ఆచమనంబుకు నీళ్ళునులేక
భయముచె ప్రార్థనజేసిరిగా

54 ఋషులప్రార్థన శంకరుడినియూ
కమండలంబును వంచెనుగా
యథారీతిగను నర్మదానదియు
ప్రవహించెను బహుచిత్రముగా

55 గోవిందభగవత్పాద గురువుకు
ఈవిషయంబు తెలియగనె
సంతోషంబును పొందినవాడై
శంకరయతితో ఇటుబల్కె

56 శంకరశిష్యా నిజంబుగాను
సాక్షాత్ శంకరుడేనీవు
హిమవత్పర్వత యజ్ఞంబునకును
పోయిఅత్రితో వినివుట్టి

57 బ్రహ్మసూత్రములబాహ్యాంబులచే
లోకవంచన చేసెదరు
ఆసమయంబున పరమేశ్వరుడే
అవతారంబు చేసియును

58 సన్యాసంబును స్వీకరించుటకు
నీవద్దకు అరుదెంచునుగా
బదరికాశ్రమంబునకు నీవు
బాహ్యారచనకు పంపుడనె

59 ఓమహాత్మ అట్టిశిష్యుని
ఎట్లుతెలియగ వలెననియు
నర్మదజలమును యావశిష్యుడు
భరింపజేయును అతడనిరి

60 నీ దర్శనమున మేము ధన్యులు
వ్యాసుల అజ్ఞారీతిగనూ
కాశియాత్రను పూర్తి జేసుకొని
బదరిచేరుమని ఆజ్ఞనొసగె

61 వ్యాసమహర్షుల ఆజ్ఞరీతిగా
బ్రహ్మసూత్రముల భాష్యమును
రచించులోక కల్యాణముకై
శ్రేయస్సగునని జెప్పెనుగా

62 గురువుల అజ్ఞను మీరగలేక
శంకరుడాశ్రమమును విడచి
విశ్వేశ్వరుని దర్శించుటకై
కాశీయాత్రకు వెడలెనుగా

స ప్త మో ధ్యా య ః

1 గురుని ఆజ్ఞనుబొంది శంకరుడు
పాదచారిగా వెడలియును
కాశీక్షేత్రము చేరినవాడై
భాగీరథిని ప్రార్థించె

2 ఛాయనసూర్యుని రూపముదెలుపు
గీయనకవుల నాలుకలో
రతియనగాను స్వరూపంబును
బాగుగ తెలిపి గుర్తునియే

3 భాగీరథిలో స్నానముజేసి
విశ్వనాథుని అర్చించి
శాస్త్రజ్ఞుల అనుమానంబులను
సులలితవచనంబులదీర్చె

4 ఆసమయంబుకు ఆచార్యులకు
పదుకొండేండ్లు వయస్సుగా
స్నానంబునకు వెడలుచుదారిలో
విద్యార్థిని ప్రశ్నించెనుగా

5 ఓ విద్యార్థి డుపరుంకరణి
శాస్త్రముజపింప ఏమున్నదన
డుపరుంకరణీ శంకరయతితో
పండితుడై య్యేద ననిబల్కె

6 వైయాకరణీ పండితుడైన
ప్రయోజనంబు ఏమనగా
రాజుచే పూజిత మన్ననగల్గి
కీర్తిపొందుటే ఫలమనెను

7 రాజుమన్నన గల్గిననీకు
మర్యాదేమి ఉన్నదన
రాజువలనను ధనంబుపొంది
సుఖజీవనము చేతునని

8 ఎంతకాలము సుఖింతువనగా
సుఖింతు చచ్చేవరకనెను
చచ్చినపిమ్మట ఏమయ్యేదవన
నాకు తెలియదుయని బల్కె

9 నాశములేని స్థితినిపొందక
నీజీవితము పతనములో
కాలముగడిపె మూఢుడయనగ
అతనికి జ్ఞానోదయమాయె

10 విప్రవిద్యార్థి ఆచార్యులకు
నమస్కరించి ప్రార్థింప
విద్యార్థికపుడు శంకరుడంతా
జ్ఞానబోధను జేసెనుగా

11 గోవిందస్మరణ గావించుమురా
ధన్యుడవగుదువు పామురుడా
అంత్యకాలమున రక్షించునది
నామస్మరణేయేనమ్ముమురా

12 కృష్ణకులోబడి అశాంతిబొంది
స్వరూపచింతన మరువకుమా
పూర్వకర్మముతో గలిగినధనమున
తృప్తిగయాత్రను గడుపుమురా

13 స్త్రీలస్తనంబులు నాభిదేశము
చూచిమోహము బొందుకురా
రక్తమాంసపు కోవ్వు కండలని
మనసున మోహము విడువుమురా

14 కనులపత్రమున నీటిబొట్టువలె
నీజీవితము చంచలము
జీవితమంతా వ్యాధులచేతనె
ధుఃఖభూయిష్టము తెలియుమురా

15 ధనసంపాదన చేయువరకునూ
తనపరివారము ప్రేమించు
ధనసంపాదన యుడిగినవెంటనె
తనపరివారము కసహ్యము

16 దేహములోన ప్రాణముండెడి
వరకే అందర స్నేహంబు
స్వాశవదలినవెంటనె పత్నియు
భయంబుజెంది పరుగెత్తు

17 డబ్బుడబ్బని దోర్లిపడెదవు
సుఖంబులేదు ధుఃఖఃబే
డబ్బుగల్గిన పుత్రులభయము
అందరితోన నిష్ఠూరం

18 బాల్యములోన ఆటలుపాటలు
స్త్రీల వలపులలో యౌవనము
వృద్ధాప్యమున సర్వచింతలు
బ్రహ్మచింతనకు బిడువేది

19 నీవెవ్వరో నీ భార్యఎవ్వరో
పుత్రులెవ్వరో విచిత్రము
ఎచ్చటనుండి నీరాకడయ్యో
తత్వముచేత చింతించు

20 సత్సంగులతో స్నేహముచేయుగ
సర్వభ్రాంతులు వీడునుగా
భ్రాంతులుడుగగ జ్ఞానముగల్గి
జీవన్ముక్తి సిద్ధించు

21 వయస్సుముదరగ కామము తగ్గును
నీళ్ళుపోయిన చెరువట్లు
ద్రవ్యహీనునికి పరివారముతగ్గు
జ్ఞానికి సంసారంబేది

22 ధనంబున్నదని బలంబున్నదని
. యౌవనంబున మేరుమకుమా
రెప్పపాటులో మార్పులుజెందును
తెలసిజ్ఞానముకు పాటుపడు

23 రాత్రులు పొగళ్ళు సాయింప్రాతలు
మాసాల్ ఋతువుల్ గడుచునుగా
ఆయుర్దాయము ముగిసిపోవగ
ఆశవిడువక పెరుగునుగా

24 శంకరభగవత్పాదా చార్యులు
ద్వాదశి ఉపదేశంబులచె
వ్యాకర్ణపండితుని మూఢత రైృచి
భాగీరతికి వెడలెనుగా

25 స్నానంబాడి దేవాలయమున
విశ్వనాథుని పూజించి
దేవాలయములో విద్వాంసులతో
శాస్త్రవాదనకు నిలబడెను

26 ఆ సమయంబున చోళదేశమున
బ్రహ్మచారి విష్ణుశర్మండు
గురువును వెదకుచు కాశీచేరి
ఈ వాదనలో పాల్గొనెను

27 శంకరగురుని చూచిన వెంటనే
నమస్కరించి నిలబడెను
ఇతనికాంతి గంభీరతగాంచి
చూచి శంకరుడు తెలసుకొనె

28 శిష్యునిగాను చేసుకొనుటకు
విష్ణుశర్మను ప్రశ్నింప
ఓ మహాత్మా నీ పూరేదీ
దానిని నాతో దెల్పుమన

29 నా పేరేదని చెప్పుదుస్వామి
అందరిపేరే నా పేరు
కండ్లకగపడని పేరునాది
హృదసాక్షిని వివరించె

30 శంకరగురుడు హాసన్ముకంబున
నాశిష్యుడుగ ఉండినచో
జోళిగబట్టి బిక్షమెత్త వలె
ఏమిచెప్పెదవు యని యడిగె

31 గురుదేవా నే జోళిగబట్టుట
అనేకజన్మ సుకృతమున
సనందనుండని నామంబొసగి
సన్యాసంబును నొసగెనుగా

32 ఒకదినంబున శంరగురుడు
గంగాస్నానము చేసియును
శిష్యులగూడి వచ్చువేళలో
పరమేశ్వరుడు మోచించి

33 కలియుగంబున పదుకొండేండ్లు
బాలసన్యాసి కీర్తియును
లోకంబునకు తెలియుటకొరకై
పరీక్షించుటకు వెడలెనుగా

34 పరమేశ్వరుడె చండాలుండై
నాల్గువేదములు కుక్కలుగా
సురాభాండము తలపై నిడుకొని
శంకరభాలుని ఎదుటొచ్చె

35 ఎదుటవచ్చెడి చండాలునితో
శిష్యులశంకరు డిట్లనిరి
చండాలుండా దూరమెడలుమన
అతడపుడిట్లు ప్రశ్నించె

36 ఓయతివర్యా పొమ్మనెదావు
ఈదేహంబునో ఆత్మనో
దేహముదూరముయని నుడివెదవ
నీదినాది ఒకటేగా

37 ఆత్మనుపొమ్మని చెప్పెదవేమో
ఆత్మవ్యాపకము ఎట్లగును
ఈ విచారము తెలియకనీవు
లోకవంచన చేతునన

38 శంకరచార్యులు ఈమాటలువిని
ఆశ్చర్యంబును బొందియును
చండాలవ్యక్తికి నమస్కరించియు
క్షమాపణంబు అడిగుయును

(8)

39 చిత్ స్వరూపమును స్వానుభవమున
అనుసంధానము చేసినచో
పంచములైన బ్రాహ్మణులైన
వారేనాకు గురువులనే

40 స్తోత్రరూపమున మనీషపంచక
వ్యక్తమాలిక చెప్పెనుగా
చండాలత్వము ఈశుడువదలి
ప్రత్యక్షంబున నిలబడెను

41 పరమేశ్వరుని చూచినవెంటనె
ప్రదక్షిణంబు చేసియును
నమస్కరించి నిలబడగానె
పరమశివుండు ఇట్లనెను

42 నాయశంకరా నీవనిప్రేమచే
ఆలింగనము జేసుకొని
అద్వైతంబును స్థాపింతువని
పరీక్షించితినే ననియే

43 బ్రహ్మవిచారణ చేయుటకొరకై
సూత్రభాష్యములు వెలువడెను
వాటికిభాష్యాల్ భిన్నమగుటచే
వ్యాసుడునన్ను ప్రార్థించె

44 వాటికి సత్యాభాషమునేనే
వ్రాసెదనేనే యనియుంటి
అందుననీవు బదరికిపోయి
సూత్రభాష్యము వ్రాయుమనె

45 ఇందుమూలమున వ్యాసశిష్యులకు
నీశిష్యులకు పాఠమును
పఠింపజేసి లోకంబునకు
జ్ఞానబిక్షను పెట్టుమనె

46 శిష్యులగూడి సంచరించుచు
వాణిమండన మిశ్రునకు
శాపంబులను పరిహరించియు
జగద్గురువుగా వుండుమనె

47 సర్వస్వతంత్ర సిద్ధినిబొంది
సత్ప్రతిష్ఠను జేయుమని
ఆశీర్వాదము చేయుచుశివుడు
అంతర్ధానము నొందెనుగా

48 ఈసమయంబున వచ్చిచూచుట
వచ్చినదేవత లందరునూ
పువ్వులవాన కురిపించియును
కీర్తి ప్రకటన చేసిరిగా

49 ఇదేసమయమున కాశీవాసులు
ఆచార్యులకు ప్రిమిల్లి
పరిపరివిదముల బాగడుచునుండగ
ప్రయాణామైరి బదరికకు

50 ఉష్ణప్రదేశము శీతప్రదేశము
సమశీతోష్ణ ప్రదేశమున్
రాళ్ళుముండ్లు వంకరత్రోవలో
వెడలుచు బదరికచేరిరిగా

51 శంకరచరితము గానరూపముగ
పాడినభక్తుల పాపములు
పటాపంచలై తత్వముదెలసి
పరమానందము బొందెదరు



## అష్టమోధ్యాయః

1 బదరిక్షేత్రని వ్యాసఋషులు
వ్యాసశిష్యులు ప్రశిష్యులు
శంకరగురుని ఆహ్వానించి
అర్ఘ్యపాద్యముల నిచ్చిరిగా

2 బదరివాసుల సత్కారమునకు
ఆచార్యులు సంతసమొంది
శాంతిమయంబగు వాతావర్ణము
పర్ణశాలలు గాంచియును

3 వైరమువిడచి వర్తనచేసెడి
మృగముల గుంపులుచూచియును
పాతాళగంగను ఋషులగుంపులను
చూచిసంతసము జెందిరిగా

4 వ్యాసాశ్రమమున వాసముచేయుచు
బ్రహ్మసూత్రముల భాష్యమును
అద్వైతపరంబుగ భాష్యమువ్రాయుచు
పారక్రమము చేయించి

5 ఆసమయంబుకు శంకరగురునికి
పండెండేండ్లు వయస్సుగా
భాష్యార్థములను బాగుగగ్రహించె
సనందశిష్యుడు ధైర్యముగా

6 సనందశిష్యుని శ్రద్ధనుగాంచి
శంకరగురుడు పాఠమును
మూడుమార్లు పాఠముజెప్పి
ప్రతిభవాత్సల్యము జూపెనుగా

7 సనందునునిపై శిష్యులందరికి
అసూయగల్గుట తెలిసియును
శంకరగురుడు పరిహారించుటకు
ఒకపరీక్షను చేసెనుగా

8 ఒకదినంబున స్నానంబునకై
పాతాళగంగకు వెళ్ళియును
తీరంబుననూ కూర్చొనియుండి
ఆవలిఒడ్డుకు వెడలెనుగా

9 మనోహారంబగు పుష్పంబులను
చూచిసనందుడు తెచ్చుటకు
ఆవలిఒడ్డుకు పోయినవాడై
కోయుచునుండె పుష్పములు

10 సనందనశిష్యుని మహిమచూపుటకు
సమయంబనియు శంకరుడు
శీఘ్రంబుగను సమీపంబుకు
రమ్మని కేక వేసెనుగా

11 సనందనుండు పువ్వులబుట్టిని
చేతిలోనిడుకొని నదిపైన
పాదంబులను పట్టుచునుండగ
గంగభక్తికి మెచ్చెనుగా

12 ప్రతిపాదములకు కమలమునొకటి
ఆధారంబుగ గంగోపగె
దీనినిజూచిన శిష్యులందరు
పరమాశ్చర్యము బొందిరిగా

13 కమలంబులపై పాదములిడుచు
శీఘ్రమెగురుని జేరెనుగా
అప్పటినుండి సనందనునికి
పద్మపాదుడని పేరొచ్చె

14 శిష్యులకసూయ అప్పటినుండి
పోయిప్రేమలు హెచ్చెనుగా
శిష్యులందరితో రెండువత్సరాల్
బదరివాసము చేసిరిగా

15 శిష్యులందరికి సూత్రభాష్యములు
సులలితంబుగా జెప్పినమా
దర్శనమివ్వక వ్యాసులుండగా
కిన్నతనొంది శంకరుడు

16 విశ్వేశ్వరుని మెప్పించుటకై
శిష్యులకూడి శంకరుడు
కాశికిగాను వచ్చుచునుండగ
దైత్యులు వాదన కొచ్చిరిగా

17 అఘోరమతము శిద్దమతంబు
పశుపతిమతము రశ్వామతం
చిద్విలాస మంతబు వార్లు
వాదనచేయుట కొచ్చిరిగా

18 శిద్ధాంతములను శంకరుడినియు
కార్యకారణాల్ దృష్టాంతం
ఏకత్వములో అనేకత్వము
యుక్తులచేత బోధించె

19 భేదత్వమునకు అజ్ఞానంబె
కారణమనియు కనపరచి
అజ్ఞానంబు నాశంబైన
దుఃఖమెలేదని వాదించె

20 అద్వైతార్థము గ్రహించినంతనె
శిష్యత్వంబును జేసిరిగా
శిష్యులనందరి వెంటనిడుకొని
కాశిక్షేత్రము జేరిరిగా

21 ఒకవత్సరము సూత్రిభాష్యములు
శంకరగురుడు పఠింపగా
పరమేశ్వరుడు సంతసించియు
ఈరీతిగను బల్కెనుగా

22 సూత్రభాష్యము ఈకాలముకు
స్వార్థకత్వము పొందెనుగా
జిజ్ఞాసులకు దీనికన్నను
ఉత్తమసాధన లేదనియె

23 విరుద్ధభాష్యముల్ ఖండనచేసిన
ఈభాష్యంబు క్రమంబుగా
ప్రఖ్యాతిగనూ నిలచిననీకు
వ్యాసులు దర్శన మిడుననియె

24 శంకరయతియు అచ్చటనుండి
గంగాతీరము జేరియును
పర్ణశాలలో శిష్యులగూడి
పాదప్రవచన చేసెనుగా

25 ఆసమయంబుకు శంకరయతికి
పదహారేండ్లు వయస్సుగా
వీరినిగాంచుట కొరకై వ్యాసుడు
వృద్ధరూపమున అరుదెంచి

26 శిష్యవర్గముకు పాఠముజెప్పి
ఆచార్యులను జేరియును
వారిచే సన్మానంబును జెంది
వృద్ధుడు ప్రశ్నచేసెనుగా

27 సూత్రభాష్యముల ప్రశ్నోత్తరములు
ఎనిమిదిరోజులు జరిగెనుగా
ఈయర్థములు పద్మపాదునికి
మాత్రమె అర్థంబాయెనుగా

28 పద్మపాదుడు దివ్యదృష్టితో
చూడగ ఉభయులు హరిహరులు
దీనిని తెలిసి ఆనందంబున
ఇట్లు చింతన చేసెనుగా

29 సాక్షాత్ శివుడే శంకరుడనియు
వృద్ధబ్రాహ్మణుడు వ్యాసుడని
ఇట్టివారికి వాదము జరుగగ
పద్మపాదుడు పొగడెనుగా

30 శంకరుడపుడు శబ్దమువినియు
ఆశ్చర్యంబును జెందియును
శిరస్సునెత్తి జూడగ నపుడు
వ్యాసుడు కండ్లకు అగబడెను

31 శంకరగురుడు వెంటనెలేచి
నమస్కరించి నిలబడియు
నా యపరాధము క్షమించుమనియు
వ్యాసునితోడ బల్కెనుగా

32 ఎనిమిదిరోజులు నీకుతొందర
ఇచ్చినందుకు క్షమించియు
తప్పులన్నియు తిద్దియునన్ను
అనుగ్రహించుము యనివేడె

33 వ్యాసుడు సంతోషంబును జెంది
అయ్యా యతివర్యాయనియు
దక్షిణామూర్తి హయగ్రీవ
దత్తాత్రేయ శుకనారదులు

34 బాదనారాయణుడు శంకరుడై య్యు
రామకృష్ణుల రీతిగను
వీరిలోవ్యత్యాసంబునులేక
నీలోతప్పులు లేవనెను

35 నీభాష్యంబే జగత్తులోన
శాశ్వితంబుగా నిలచునుగా
నాకోరతంతా తీరిపోయెను
నీవుప్రచారము చేయుడనన్

36 వ్యాసులఆజ్ఞను వినినశంకరుడు
అవకాశంబు లేదనియు
నాకువయస్సు పదహారేండ్లు
ఈదినంబుకు ఆయేనుగా

37 మీరుఆజ్ఞను నొసగిననాకు
గంగఒడ్డున మరణింతు
ఆజ్ఞ ఇవుడు ఋషివర్యా యన
వ్యాసుడునగుచూ ఇట్లనియె

38 శంకరనీకుమృత్యు ఉన్నదా
వ్యవహారంబున బల్కెదవు
ఎనిమిదిఏండ్లు ఆయుస్సుండి
సన్యాసంబున పెంచితివి

39 ముందుకార్యములు జాలగనున్నవి
వ్యాసులుపట్టము గట్టియును
కమండలోదక మంత్రముతోన
ఆయువృద్ధి చేసిరిగా

40 ఆసమయంబున బ్రహ్మవిష్ణువులు
విమానంబులలో గంధర్వుల్
దేవదుంధుబులు మ్రోగగనపుడు
పుష్పవర్షము కురిసెనుగా

41 హరిహరబ్రహ్మలు వ్యాసమహర్షి
సంతోషంబున అరుదెంచి
శంకరగురుడు వాదనకొరకై
ప్రయాణంబును చేయుచునూ

42 ప్రయాగక్షేత్రము యమునానదిలో
స్నానంబాడి శిష్యులకు
అద్యయనంబు చేయువేళలో
అచ్చట కొందరు ఇట్లనిరి

43 సుధన్వారాజు సమక్షమంబున
కొండనుండియూ దుమికినయూ
భట్టపాదుడు తుషానలంబున
ప్రవేశించునని చెప్పగనె

44 శంకరగురుడు విస్మయంబున
భట్టపాదుని గృహాంబుకు
చేరిచూడగ తుషానలంబున
భట్టపాదుడు కనుపించె

45 శంకరగురుని చూచినవెంటనె
భట్టపాదుడు శిష్యులచె
అర్ఘ్యపాద్యము సత్కరించియు
లోనికిరమ్మని బల్కెనుగా

46 భట్టపాదుడు వ్యాససూత్రముల
చూచుటలభ్యము లేదనగా
శంకరగురుడు మంత్రోదకమున
బదికింతును నిన్ననిబల్కెనుగా

47 భట్టపాదుడు శంకరయతితో
గురుద్రోహిని నేననియు
తనవృత్తాంతము నంతయుజెప్పి
ప్రాయశ్చిత్తము నాకనియే

48 దేవునికోపంబై సహింతును
గురుద్రోహము నే సహించనూ
తుషానలంబున విముకతపొందను
నీవుఇట్లు జేయుడనె

49 భరతఖండమున మండనమిశ్రుని
శాస్త్రవాదమున జయించిన
లోకమునంతా జయించినట్లె
ముందుకార్యములు జరుగుననే.

50 శంకరగురుడు ఈ మాటలువిని
శాస్త్రవాదనకు వెడలియును
అంతరిక్షమున వెడలినవాడై
నదీతీరమున నిలచెనుగా



## నవమోధ్యాయః

1 మత్యలోకము స్వర్గంబోయన
రత్ననిర్మితభవనములో
విశాలమైనా వీధులచేత
మహిష్మతీపుర మగబడెను

2 ఆ పట్నములో మండనమిశ్రుల
గృహంబు గుర్తించుటకొరకై
స్నానముచేసి యోచించగను
అంతలోనే వకడరుదెంచె

3 మండన మిశ్రుల ఇంటిసేవకుని
శంకరుడిట్లు ప్రశ్నించె
ఈ పురిలోన మండన మిశ్రుల
గృహంబు గుర్తు ఏదనియే

4 చిలుకలు వేదాల్ చెప్పుచునుండె
గృహంబుమండన మిశ్రులది
అతనిపేరు తెలియనివారు
లేనే లేరనె సేవకుడు

5 శంకరగురు డీమాటలు వినగా
ఆశ్చర్యంబును చెందియును
అరుదెంచియును మండన మిశ్రుల
గృహద్వారము జేరెనుగా

6 మండన మిశ్రుల గృహద్వారము
తలుపులువేసి వుండిరిగా
ముంగిట చిలుకులు యతివరుగాంచి
విచిత్రంబుగా మాట్లాడె

7 శంకరుడచ్చట నిలబడివుండగ
శ్రాద్ధమంత్రములు వినబడియే
జైమునివ్యాసులు పితృస్థానముకు
ప్రతిష్ఠాశనముకు వచ్చిరిగా

8 ఆ సమయంబున శంకరయతియు
గృహములోనికి గగనమున
ప్రవేశించియు ఉభయులమధ్య
కాళ్ళుచాచుకొని కూర్చొనెను

9 ఈ గంబీరము ఈవేషమునకు
లోనికివచ్చిన కృత్యముకు
మితిమీరిన ఆశ్చర్యము కోపము
దాల్చిమండనుడు ఇటుబల్కె

10 కలియుగంబున వర్జితమైన
ఈసన్యాసిని చూచుటచే
సచేలస్నానము చేయకుండిన
కార్యమునాశంబని కోపించె

11 ఉభయులకపుడు విచిత్రమైన
ప్రశ్నోత్తరముల జరుగగనూ
మండనమిశ్రుడు క్రోధమునొంది
ఏమితోచక నిలబడెను

12 శంకరగురుడు శాంతముతోడ
మండనమిశ్రుని గాంచియును
గృహస్థధర్మాల్ బోధించగనూ
శిగ్గుచెతలను వంచుకొనె

13 మండనమిశ్రునిగాంచి వ్యాసులు
ఈసన్యాసి ఈశుడని
అవివేకముకు క్షమాపణడిగి
సత్కార్యంబు చేయుడన్

14 మండనమిశ్రుడు గురువులఆజ్ఞచే
విష్ణుస్థానముకు నిలువుని
భిక్షతీసుకొని క్షమించుమనగా
శంకరుడిట్లు బల్కెనుగా

15 నేనువచ్చినది భిక్షుకుకాదు
శాస్త్రవాదనకు వచ్చితిని
వాదభిక్షతో తృప్తిజేయుమని
మండనుడిట్లు ప్రార్థించె.

16 ఈదినంబు తండ్రిశ్రాద్ధము
రేపువాదన చేతుననె
అట్లెఒప్పగ శంకరయతికి
అర్ఘ్యమునిచ్చె యతికపుడు

17 మహిష్మతీపుర దేవాలయమున
వ్యాసజైమునులు నిలచిరిగా
మండనమిశ్రుడు వీరినిగాంచి
వాదలో సాక్షికి నిలువుమనె

18 దీనినిగాంచి శంకరయతియు
వాదము తీర్మానించుటకు
ఉభయభారతి ఏర్పరచమన
అట్లేనిర్ణయ మాయెనుగా

19 వ్యాసజైమునులు ప్రయాణమైరి
ఈ విచారము దేశములో
వ్యాపించుటచే విద్వాంసులందరు
వాదము చూచుట కొచ్చిరిగా

20 స్వర్గలోకమునుండి దేవతులు
శాస్త్రవాదము జూచుటకై
కామరూపమున అరుదెంచియును
ఇంటిపై కూర్చొని వుండిరిగా

21 వాద ప్రతివాదంబులకొరకై
సభప్రవేశము జేసిరిగా
మండన మిశ్రుడు సోలినవారెకి
ఫలంబు ఏమని యతినడిగె

22 శంకరగురుడు హాసన్ముఖంబున
నీవుసోలిన సన్యాసి
నేను సోలిన గృహస్తుడగుదును
సలితంబులను బల్కెనుగా

23 వాగ్వాదమునకు ప్రారంభమున
సరసవాణి సభకరుదెంచి
మహాత్ములారా గృహిణిగాన
ఎన్నోపనులు నాకుండు

24 మంత్రిపూరిత పుష్పమాలికలు
ఉభయుల మెడలో వేసెదను
వాడిపోయిన మాలికవారే
సోలినట్లుగ తెలియుడనె

25 సభికులందరూ సరసవాణిని
యుక్తికిమెచ్చి ఒప్పిరిగా
మాలలువేయగ వెంటనె ఉభయులు
శాస్త్రవాదముకు మొదలిడిరి.

26 కర్మపరంబుగ మండనమిశ్రులూ
అద్వైతంబుగ శంకరులూ
బ్రహ్మాండంబుగ వాదనజరిగె
పదహారు దినంబులు కడచెనుగా

27 షోడశదినమున మధ్యాహ్నంబు
సరసవాణీ అరుదెంచి
ఉభయులుగాంచగ పతివేదమాలిక
వాడియుండుట గాంచియును

28 ప్రాణనాథుని బిక్షుకుగాను
సరసవాణి పిలువగనే
సభికులందరు ఆశ్చర్యముగా
ప్రతిమల రీతిగ నిలచిరిగా

29 సరసవాణి శంకరగురుణితో
తనవృత్తాంతము జెప్పియును
సత్యలోకముకు అరుదెంచుటకు
అంతరిక్షముకు వెడలెనుగా

30 దుర్గమంత్రము పఠనముజేసి
ఆ ప్రభావమున శంకరుడు
సరసవాణి భండజేసి
ప్రార్థనజేసి నిలచెనుగా

31 మండనమిశ్రుడు శంకరయతితో
నా సంశయము తీరెనని
జై ముగురుడు ఈ విచారమును
నాకు తెలుపకా పోయెననే

32 యతివర్యుండు ఈ సంశయముకు
గీత ప్రభావము బోధించె
కర్మమార్గమున జ్ఞానముగల్గెను
నీకు గల్గెనని జెప్పెనుగా

33 నీ సంశయము తీరుటకొరకై
గురువుని స్మరణజేయుమనె
మండనుడపుడు గురువుని స్మరింప
జైముని ఎదుట వచ్చెనుగా

34 గురువునిగాంచి మండనమిశ్రుడు
నమస్కరించి నిలచెనుగా
జైముని ఋషియు తనమనంబున
ఈ రీతిగనూ తెల్పెనుగా

35 సామానవమాత్రుడు కాదు శంకరుడు
సాక్షాత్ శివుడె ఇతడనియు
ఇతని దర్శనము ధన్యతనిచ్చును
సర్వజ్ఞుండు ఇతడనియె

36 కృతయుగంబున కపిలుడుగాను
త్రేతాయుగంబున దత్తుండు
ద్వాపరంబున వ్యాసుడుగాను
కలియుగంబున శంకరుడు

37 మండనమిశ్రుని సంశయంబును
తీర్చి జై ముని జనెనంత
సరసవాణి త్రిలోకమునకు
కీర్తినుంచుటకు యోచించె



## ద శ మో ధ్యా య ః

1 శంకరగురుడు సన్యాసగుట
స్త్రీల పరిసంగము ఒప్పదుగా
అయినను శాస్త్రసమ్మతంబున
ఒప్పింతునని ఇట్లనియె

2 భార్యభర్తకు అర్థశరీరము
నన్ను జయించిన జయింతువు
ధర్మమాత్మ్యము ఇట్లుండగనూ
నీకు గర్వము ఎందుకనె

3 నాతో వాదనుచేయ వలయునని
వాణిప్రార్థన చేయగనూ
శంకరగురుడు ఖిన్నతనొంది
శాస్త్రసమ్మతమె యనుకొనెను

4 వాదనచేయుట కొప్పినయెడల
లోకగురువులకు విరుద్ధము
ఒప్పకుండిన శాస్త్రవిరుద్ధము
ఏమిచేతునని యోచించె

5 సరసవాణి నన్ను క్షమించు
స్త్రీ ఎదుటుండుటా తగనిపని
ఇట్లుండగనూ నీ ప్రసంగము
తగదు లోకము ఒప్పదనె

6 సరసవాణినగు ఇట్లనె
శంకర సోలితినని జెప్పు
దారిపట్టుకొని పొమ్మనియనియు
మరి ఇట్లు బల్కెనుగా

## శ్రీ శంకరాచార్య తోహారగానం

7 సులభ జనకులకు వాదలేదా
మైత్రేయిఋషులతో వుండినది
శాస్త్రసమ్మతము ఇట్లుండగనూ
నన్నుఖండన జేసెదవా

8 తల్లినన్ను పుత్రుణి రీతిగా
భావనచేసిన వాదింతు
అనిశంకరుడు వేడగనపుడు
అట్లే ఒప్పి నిలచెనుగా

9 సరసవాణి శంకరగురునితో
షోడశదినముల్ వాదనజరిగె
సరసవాణి మహిమనుగాంచి
చకితుండాయెను భర్తపుడు

10 గెలువగలేక ఉభయభారతి
తలవంచుకొనియు నిలబడెను
శంకరుడపుడు వాణినిగాంచి
ఇక ఏమున్నదో అడుగుడనె

11 సరసవాణి ధైర్యంబుగనూ
కోపముతోడ ఏమైన
ఈ సన్యాసిని ఓడించెదనని
ఈ రీతిగనూ యోచించె

12 ఈ సన్యాసికి వయసులేదు
కామపరిచయము తెలియదుగా
కళాశాస్త్రము ప్రశ్నించినచో
సోలిపోవునని ఇటుబల్కె

13 కామకళలు ఎన్నివిధంబులు
వాటికి అంగంబులుఏవి
శుక్ల కృష్ణ పక్షములందు
వృద్ధిక్షయములు ఎట్లనియే

14 ఆచార్యులు ఈ వాక్యములినగా
చెవులు మూసుకొని ఇట్లనియే
ఈ మాటలను వినగనె బ్రహ్మను
ఉత్తరమెట్లు చెప్పెదనని

15 యోచనచేసిన సరసవాణితో
ఈ రీతిగనూ ప్రశ్నించె
పాపపుణ్యములు దేహంబునకా
లేక జీవునకో తెల్పుడనెా

16 పాపపుణ్యములు జడదేహమునకు
జీవుడు నిర్లిప్తుండనగా
ఈ మాటలను విని ఆచార్యుడు
సరసవాణిని ప్రార్థించె

27 శిష్యులగూడి శంకరుడప్పుడూ
హిమవత్పర్వతమును జేరి
యోగదృష్టితో చూడగనప్పుడు
మృతినొందుండె అమరుకుడు

28 భౌతికదేహ రక్షణానంతా
తొందరగల్గిన కర్తవ్యం
శిష్యులకంతా బాగుగ జెల్పి
దేహాముువిడచి వెడలెను

29 గుర్జర దేశము అమరకరాజు
శవ శరీరము శిద్ధముగా
స్మశానంబుకు ఎత్తువేళలో
ఆ శరీరములో దూరెనుగా

30 శంకరరూపి సూక్ష్మశరీరము
అమరుకరాజు స్థూలములో
ప్రవేశించిన వెంటనెరాజు
నిద్రరీతిగా మేల్కొనెను

31 జనులందరికీ ఉత్సాహావింతలు
చెప్పగలేని రీతిగనూ
రాజును అంతఃపురములోనికి
వెంటనె నిడుకొని వెళ్ళిరిగా

32 మరుసటిదినమే అమరకరాజు
రాజ్యభారముకు మొదలిడెను
అప్పటినుండి రాష్ట్రింబంతా
నూతనమార్పులు గల్గెనుగా

33 వాడినపైరులు కళ కళ లాడెను
పంటలు బాగుగ పండెనుగా
ప్రజావర్గమున ధర్మబుద్ధియు
వర్ణధర్మములు జరిగెనుగా

34 ధానధర్మములు పరోపకారాల్
దీనులరక్షణ జరుగుటయు
రామరాజ్యము తీరుగరాష్ట్రము
స్వర్గంబుగనూ తోచెనుగా

35 రాజకీయ వ్యవహారంబులు
మంత్రినడుగకనె జరిగెనుగా
వ్యవహారంబుల సూక్ష్మతగాంచి
మంత్రికి ఆశ్చర్యంబాయె

36 మంత్రియోచనచేసి తెలసుకొనె
ఏ మహాత్ముడో ఏ కార్యముకో
రాజుదేహములో చేరినాడని
పరీక్షించుటకు యోచించె

37 ఒకదినంబున శయనగృహంబున
మంచముపైన కూర్చొనియు
పట్టపురాణిని చూచినంతనె
రాణికి రతి సుఖమునుతోచె

38 చూపునగల్గిన అపరసుఖముకు
రాణియోచన చేసెనుగా
దేహము మాత్రము పూర్వపురాజుదే
జీవుడు రాజుకాదనియే

39 అర్ధరాత్రి సమయమునందున
రాణినిశ్చయము చేసుకొనె
మార్గమునుండి వాపసుతిరిగి
మంత్రి ఆహ్వానముచేసె

40 రాణిమంత్రితో ఈ రీతిగననె
నీవు రాజ్యముకు ముఖ్యుండు
రాజ్యభార్యము చూచిననాకు
నూతనంబుగ నున్నదిగ

41 భాగుగచూచి యే మహాత్ముడో
ఏ కార్యముకో అరుదెంచి
రాజ్యభారము చేయుచునుండు
ఇది నా నిశ్చయమనిదెల్పె

42 మంత్రి రాణి ఊహాశక్తికి
ఆశ్చర్యంబు జెందియును
నీ నిశ్చయము నా ఊహాను
రెండూ ఒకటియని బల్కె

43 మీ నిశ్చయము తీరుగ మనము
ఈ రాజ్యమునె నిలుపవలె
అందున మనము శవశరీరములు
కాల్చుగ యోచన చేతుమనె

44 మరుసటిదినము రాజు రాణి
ఆజ్ఞ అయినది ఇట్లనెను
ఈ వత్సరము భరతఖండమున
అనాథ ప్రేతాసంస్కారం

45 రాజధాని ఖర్చుచేతనే
ఈ పని చేయవలెననగా
నగుముఖంబున రాజు ఈపని
బాగున్నదని బల్కెనుగా

46 దేశములోన అనాథప్రేత
సంస్కారంబని వ్యాపించె
ఈ విషయమును వినిన ప్రజలు
రాజుత్యాగమును పొగడిరిగా

47 శంకరగురుని దేహంబునకు
అపాయంబుగల్గునని
రాజుఆజ్ఞ బలవత్తరమని
రక్షణ సనందనుడు నిలచె

48 తక్కినశిష్యులు కొందరుజతగా
గురుని వెదుకగా వెడలియును
దక్షిణదిక్కులో అమరుక దేశము
ఉన్నతస్థితిని తెలసిరిగా

49 ఆదేశములో రాజు బ్రదికినది
రాజ్యధర్మము తెలసుకొని
ఇచ్చటనే గురుడుండవలయునని
రాజధానిని చేరియును

50 ఇద్దరు శిష్యులు కిన్నరి శృతిలో
ఆత్మతత్వమును గానముగా
తత్వమసీయని పాడినంతనె
గానము రాజుకు వినబడియు

51 గానముద్వార మాటల అర్థము
ఈ రీతిగనూ తెలసెనుగా
గుణంబులకునూ విలక్షణుండగు
పరబ్రహ్మము నీవనిరి

52 తుమ్మెద నేవు నీ సహపాటుల
విడచిమేడలో ఉండుటచే
నీ సహవాసము ఆపేక్షించియు
ఉందురు అందున రావలెగా

53 విధ విధంబుల గంభీరముగా
శిష్యులుపాడిన అర్థములు
రాజురూపుడగు శంకరగురునికి
శృతిగల్గుటచే శీఘ్రముగా

54 సోపానములను దిగుచురాజు
కాలుజారిన వాడై య్యు
క్రిందకుపడియు మృతుడాయెనని
అంతఃపురమున ఏడ్చిరిగా

55 వచ్చిన శిష్యులు తమకార్యంబు
నెరవేరెనని హర్షముతో
హిమవత్పర్వత మార్గముబట్టి
శీఘ్రంబుగనూ వెడలిరిగా

56 ఇచ్చటరాజు ఆజ్ఞనుబొంది
మృతశరీరముః కాల్చుచునూ
హిమవత్పర్వత ప్రదేశమందును
శంకరగురుని శరీరము

57 కాల్చుటకొరకు ప్రయత్నించగా
శిష్యులు ప్రార్థన జేసిననూ
బహుమానంబుల అపేక్షచేత
క్షితికి అగ్ని పెట్టిరిగా

58 శంకరగురుని స్థూలశరీరము
చితిలో కాల్చుచు నుండగనే
ఆసమయములో సూక్ష్మశరీరము
ఇందులో ప్రవేశమాయెనుగా

59 వెంటనె దేహము పైకిలేవగా
చితిఅంతయును పడిపోయె
నాల్గుదిక్కుల అగ్నిరగులుకొనె
దీనినిచూచి భయపడిరి

60 శంకరుడపుడు అగ్నిశాంతికి
లక్ష్మీనృసింహ స్తోత్రమును
జేయగనపుడు ప్రత్యక్షంబై
అగ్నిశాంతిని జేసెనుగా

61 రాహువుచేత విడదలపొందిన
సూర్యుడోయన శంకరుడు
పుటమువేసిన సువర్ణమట్లు
ప్రకాశించుచూ వెడలెనుగా

## ఏ కా ద శో ధ్యా యః

1 శంకరగురుడు మహిష్మతీపుర
మండన మిశ్రునిద్వారమున
నిలబడినంతనె ఉభయభారతి
నడుగుచు నిట్లు బల్కెనుగా

2 సామాన్యుడవు కావు మహాత్మ
నాప్రశ్నల కుత్తరమొచ్చె
విద్యాస్వరూపుడగు ఈశ్వరుండవు
వ్యాపకబ్రహ్మము నీ వనియే

3 స్వామీ మేము మీ పాదముల
సన్నిధి సోలినకీర్తిను
నా భర్తకు సన్యాసంబునకు
నాకు ఆజ్ఞను వెడలుటకు

4 శంకరుడవుడు సరసవాణితో
అమ్మావరముల నిచ్చియును
సత్యలోకముకు వెడలవచ్చునను
వాణిని వరముల నడిగెనుగా

5 భూలోకమున ధర్మస్థాపన
విద్యాపీఠంబులు నాల్గు
శృంగేరి పీఠమున శారదాంబవై
సాక్షాత్తుగను వుండవలె

6 ఈ వరంబుల శారదయొసగి
సత్యలోకముకు జనెనంత
మండనమిశ్రుడు సర్వధనంబును
దానముజేసె విప్రులకు

7 శంకరగురుని ఆజ్ఞనుమేరకు
కాషివస్త్రముల ధరించియు
సన్యాసంబును స్వీకరించగా
సురేశ్వరుండని పేరొచ్చె

8 శంకరశిష్యులలోన ప్రథముడు
పసందనాచార్యుండునుగా
ద్వితీయ శిష్యుడు సురేశ్వరుండై
శ్రీశైలంబుకు వెడలిరిగా

9 శ్రీశైలములో మల్లికార్జుని
భ్రమరాంబమాతను సేవించి
ఆప్రాంతములో కాపాలికుల
సురాపానము విడపించె

10 సురాపానము పంచపాపముల
ఒకపాపంబని జెప్పియును
ఇందు నిమిత్తము కథనూజెప్పి
శిష్యులుగాను గ్రహించెను

11 కాపాలికుల గురువై నట్టి
ఉగ్రభైరవుడు తెలసియును
ఈ సన్యాసిని చంపవలయునని
దురాలోచన చేసెనుగా

12 శంకరగురుడు ఏకాంతమున
ఉండుసమయము భైరవుడు
శంకరయతితో ఈ రీతిగను
ప్రశ్నముజేసె వింతగనూ

13 ఈశునిగురించి తపస్సుచేయుగా
ప్రత్యక్షంబుగ అరుదెంచి
వరముల నన్ను అడుగమనగనూ
కైలాసమును గోరియును

14 ఈ శరీరముతో రావలెననగా
ఈశుడునగుచు ఇట్లనెను
నీవు ఇట్లుచేసిన యడల
సశరీరముగా వత్తువనె

15 పరమహంసుడగు గురునిదికాని
చక్రవర్తిది తలగాని
అగ్నిలోన వేల్పుమనగను
అట్లేజెప్పి వుంటినిగా

16 అందునీవు అభిమానము వదలిన
సన్యాసివిగానని దేహం
నాకు ఇవ్వుడన శంకరుడపుడు
ఈ రీతిగను నుడివెనుగా

17 శంకరగురుడు సంతోషించి
వుగ్రభైరవునితో నిట్లనెను
శిష్యులకంతా నాదేహముపై
అభిమానంబు ఉన్నవిగా

13 శిష్యులులేని సమయమందున
నీవు నాతల గొనిపొమ్మ
వారలు రేపు స్నానంబునకై
పాతాళగంగకు వెడలెదరు

19 వారికి తెలియక నాతలగొనుమా
సార్థకమాయె నాదేహం
అనిబల్కగ ఉగ్రభైరవుడు
సంతోషముతో వెడలెనుగా

20 మరుసటిదినము కత్తిబట్టుకొని
తలతీయుటకు వచ్చెనుగా

ఆ సమయంబున శంకరగురుడు
సమాధిలోన నుండెనుగా

21 అకస్మాత్తుగా పద్మపాదునికి
ఏదో తాపము గలిగియును
నృసింహస్వామిని స్మరించగానె
ఆవేశంబు ఆయెనుగా

22 ఉగ్రరూపమున శంకరసన్నిధి
తక్షణంబున చేరియును
కాపాలికుని కత్తితీసుకొని
రెండుతుండ్లుగా నరికెనుగా

23 సమాధినుండి శంకరగురుడు
బహిర్ముఖుండై చూడగనూ
ఉగ్రరూపమున నృసింహ శిష్యుని
స్తోత్రముజేసె విచిత్రముగా

24 నృసింహమూర్తి ఆసమయమున
నాట్యమాడుచూ నుండెనుగా
శంకరగురుడు నమస్కరించి
శాంతుడు కమ్మని ప్రార్థించె

25 శాంతుండైన శిష్యునిగాంచి
శంకరగురుడు ప్రశ్నించె
ఈ ఆవేశము ఎట్లుగల్గెనన
సనందనుండు చెప్పెనుగా

26 స్వామి నేను ఒకదినంబున
అహోబిళంబుకు పోతినిగా
అచ్చట నాకు ఒకమహాత్ముడు
నృసింహమంత్రము చెప్పెనుగా

27 నృసింహమంత్రము జపించినందునా
ఘోరనృసింహుడు అగపడగా
భయంబుజెందగ వరంబునివ్వక
అంతర్ధానము నొందెనుగా

28 వెంటనే నేను అవివేకమునకు
చింతజెందిన వాడై య్యు
మరల జపంబు చేయుచునుండగ
అడవి మనుష్యుడు వచ్చెనుగా

29 నన్ను గురించి అడవిమనుష్యుడు
ఎందుకు జపంబు చేతువనె
నృసింహమూర్తిని చూచుటకొరకు
ప్రార్థింతునని చెప్పితిగా

30 అడవి మనుష్యుడు నవ్వుచునాతో
స్వామిని తెత్తునుయని జెప్పి
కొంత ప్రొద్దుకు తీగులచేత
స్వామినికట్టి తెచ్చెనుగా

31 నిర్భయంబున స్వామినిచూచి
దేవ దేవుడాయె ఈ రీతి
అడవివానికి ఎట్లు దొరకితివన
స్వామి ఇట్లు బల్కెనుగా

32 ఈ మాటలను వినిన శంకరుడు
నృసింహా జయంతి చేయుటకు
ఆజ్ఞనుయిచ్చి పద్మపాదునికి
భక్తిపరిభావము జెప్పెనుగా

33 స్వరూపజ్ఞానము యుండినవాడై
భక్తిగ పూజించిన వానికి నే
వశుడగుదునని స్వామిజెప్పియు
అంతర్ధానము నొందెనుగా

34 బోయికణ్ణప్ప చరిత్రచెప్పి
ఈశుడు భక్తాదీనుడని
ఇట్లై ఎందరో భక్తులనందరి
నుద్ధరించునని జెప్పెనుగా

35 శ్రీ శైలంబును విడచి వెడలుచు
మార్గమధ్యమున విమతులను
శిష్యులగానూ పరిగ్రహించియు
గోకర్ణంబును జేరెనుగా

36 మహాబలేశుని చరిత్రజెప్పి
గోకర్ణేశుని పూజించి
వక్రతుండా క్షేత్రముజేరి
గాణాపత్యుల జయించుము

37 కల్లూరు మూకాంబదేవిని జూచి
స్తోత్రముజేసి వెడలగనూ
ద్వారమునందు శిశుశరీరముకు
ఏడ్చుదంపతుల చూచెనుగా

38 శంకరగురుడు వారినిగూర్చి
ఎందుకుమీరు ఏడ్తురనా
స్వామిమాకు పదూ్మడు శిశువులు
చచ్చిశిశువు మరణించుటచే

39 మాశిశువును బ్రదుకించుభారము
మూకాంబదిగా వున్నదని
శిశువు బ్రదుకగా పోయినయెడల
మేము ప్రాణము విడుతుముగా

40 మహాత్ములుగా అగపడుచుందురు
మా శిశువును బ్రదుకించుడనా
శంకరుడాశ్చార్యంబును బొంది
ఈ రీతిగను ప్రశ్నించె

41 చచ్చుటయన అర్థంబేమి
దేహము ఇక్కడేవున్నదనా
ప్రాణముపోయినదని చెప్పగనే
మరల ప్రశ్నను జేసిరిగా

42 ముద్దిడుచుంటిరి ప్రాణమా దేహమా
చెప్పుడుమీరని అడగగనే
ఏమితోచకా దేహంబనగా
ఉన్నదిదేహం బనెనంత

43 కనబడకుండిన ప్రాణవాయువు
పోయినదుఃఖము ఎందుకనా
అప్పుడు జ్ఞానముపొందినవారై
ఊరకె నిలబడి వుండగనూ

44 వీరిభ్రాంతినిగాంచి శంకరుడు
మూకాంబను ప్రార్థించగనూ
నిద్రనుండి లేచినరీతిగ
బాలుడులేచి కూర్చొనెను

45 దంపతులపుడు జ్ఞానముపొంది
శంకర శిష్యుల అగుదుమన
అట్లుకాదన ధర్మాల్ దెలిపి
సంసారంబున యుండుమనె

46 మూడుఅవస్థల అన్వయంబును
వ్యతిరేకంబును బోధించి
చిత్స్వరూపమును బాగుగమీరు
అనుసంధానము చేయుడనె



## ద్వాదశోధ్యాయః

1 కల్లూరునుండి రెండువేలు
శిష్యులకూడి వెడలియును
బలిపురంబను అగ్రహారము
చేరగ బ్రాహ్మణదంపతులు

2 అర్ఘ్యపాద్య చమనంబులచేత
పూజించియు నిలబడగానే
వారినిగాంచి శంకరగురుడు
కారణమేమి చింతకనె

3 స్వామి మేము తపస్సుచేత
పుత్రలాభము పొందితిమి
వీనికి ఎనిమిది ఏండ్లు అయినను
మూగివాడుగా నున్నాడు

4 ఉపనయనంబు జేసినగాని
సంధ్యావందన చేయడుగా
అన్నము నీరు అడుగడుగాని
పెట్టిన తింటూవున్నాడు

5 చచ్చిన శిశువుని బ్రతికించితిరని
తెలసి కాచుకొని యుంటిమిగా
బాలునిమీరు కాపాడండని
దంపతులిద్దరు వేడిరిగా

6 శంకరచార్యులు బాలునిగాంచగ
నగుటకు ప్రారంభించెనుగా
వెంటనె గురుడు తనహస్తంబును
బాలునితలపై నుంచెనుగా

7 భట్టులగాంచి శంకరుడపుడు
మూగికాడుకని చెప్పదహా
బ్రహ్మస్వరూపుడు మూగికాడని
మాట్లాడింతును చూడుకనె

8 నీ వెవరు నీవెందు కొచ్చితివి
నీ స్థళమేది పేరేమి
వీటికి ఉత్తరమివ్వుమనగను
ఉత్తరమిచ్చె బాలకుడు

9 రూపము నామములేనివాడు
వ్యాపకబ్రహ్మము నేననియు
ఉత్తరమివ్వగ తల్లితండ్రులు
ఆశ్చర్యంబును పొందిరిగా

10 వీరినిగాంచి శంకరగురుడు
ఈబాలుడు మీసన్నిధిలో
ఉండుటకర్హుడుకాడనిజెప్పి
వారిఆజ్ఞను తీసుకొనె

11 సన్యాసంబు బాలునికిచ్చి
శిష్యునిగానూ గ్రహించియు
హస్తామలకుండని పేరిచ్చి
మూడవశిష్యునిగాజేసె

12 శిష్యుల సంపద ప్రతిదినంబునూ
హెచ్చుచుండగా ఆచార్యుల్
అచ్చటనుండి వెడలి వారై
శృంగేరిపురంబు చేరిరిగా

13 అచ్చటపర్ణశాల వేయుమని
తుంగస్నానముకు వెడలిరిగా
ఆచ్చటకప్ప ప్రసవవేదన
పడుచుండగ ఒకసర్పంబు

14 ఎండదానిపై పడుకుండుటకై
నీడబట్టెను పడగిప్పి
దీనినిగాంచి శంకరగురుడు
సంతోషించె స్థళమునకు

15 పర్ణశాలలో పాఠప్రవచన
దినదినంబు జరుగగనూ
అచ్చట శారద పీఠస్థాపన
చేసి సురేశ్వరుడుండుటకు

16 శిష్యులందరిలో గిరియను శిష్యుడు
గురుసేవకుడై ఉండియును
గురుడుపాఠము చెప్పుసమయమున
మననము చేయుచునుండెనుగా

17 ఇట్లుండగనూ ఒకసమయంబున
శిష్యులకు పాఠము మొదలిడగా
గిరియను శిష్యుడు తుంగానదికి
సేవచేయుటకు వెళలుండే

18 ఆసమయంబున శంకరగురుడు
గిరిరాకడకు గాంచెనుగా
పాఠము నిలుపగ శిష్యులు గురునితో
వానికి తెలియదు చెప్పుడన

19 మూఢుని జతలో మమ్ముజేర్తువన
వీరిహంకారముగాంచి
ఇచ్చటనుండి శంకరగురుడు
అనుగ్రహించెని శిష్యునికి

20 తుంగానదిలో ఉండినగిరికి
దివ్యజ్యోతి వెలిగెనుగా
వెంటనె వస్త్రంబుల నిడుకొనియు
గురునివద్దకు అరుదెంచె

21 వేదాంతంబు సారమంతయు
గానరూపముగ పాడుచును
శంకరగురుని స్తోత్రముచేయగ
శిష్యులు విస్మయమునుజెందె

22 బ్రహ్మస్వరూప నిర్ణయార్థము
తోటకవృత్తంబుల బొగడ
వెంటనె శిష్యుని తోటకుండని
సార్థకనామం బిచ్చిరిగా

23 ఈరీతిగనూ నల్గురు శిష్యులు
పురుషార్థంబులో యనురీతి
నాల్గుమోక్షముల రూపంబోయన
నాల్గువేదముల రీతిగనూ

24 శంకరగురుడు శిష్యులతోడ
వార్థికంబులు వ్రాయుమన
శిష్యులు మండనమిశ్రుడు వ్రాయుట
తగదు కర్మిష్ఠుండితడనగా

25 మండనమిశ్రుడు ఆగ్రహంబున
నైష్కర్మ్యంబను గ్రంథంబు
స్వతంత్రంగా వ్రాసి దానిని
గురుసన్నిధిలో నుంచెనుగా

26 పద్మపాదునికి శంకరగురుడు
హస్తామలకుని చరిత్రను
చెప్పగనపుడు పద్మపాదుడు
పంచపాదుక వ్రాసెనుగా

27 పద్మపాదుడు తీర్థయాత్రకై
గురునిఆజ్ఞను అడుగగనూ
వలదనిచెప్పగ ఖిన్నుడుకాగా
ఆజ్ఞనొసగెను శంకరుడు



# త్ర యో ద శో ధ్యా యః

1 పద్మపాదుడు యాత్రికుపోగ
శృంగేరిలో శంకరుడుండగనూ
కాలిటిలోన తల్లి ఆర్యాంబ
మృత్యుభయంబున స్మరించగా

2 తల్లిమృత్యువు విషయస్మరణ
శిష్యులకంతా ఎరగించి
మీరలు ఇచ్చట ఉండవలెనని
తల్లి వద్దకు చేరెనుగా

3 ఆర్యాంబపుడు పుత్రునిగాంచి
సంతోషంబు పొందియును
ఆనందబాష్పాల్ విడచుచునుండి
నీవు సంస్కారము చేయుడనె

4 అవసానంబు తల్లికి పుత్రుడు
తత్వోపదేశము సూక్ష్మముగా
తెల్పిజ్ఞానము కల్గించియును
విష్ణులోకముకు బంపించె

5 తల్లి మరణముగాంచి శంకరుడు
కన్నులనీరు కార్చుచునూ
కొంతసమయము నిశ్చేష్టితుడై
సంస్కారముకు ప్రార్థించె

6 బంధువర్గము దూషణజేసి
సంస్కారముకు రామనగా
దీ మహిమంబున శంకరగురుడే
అరటిపట్లతో చితిజేసె

7 చేతులుమథించి అగ్ని పుట్టించి
శవసంస్కారము చేయగనూ
బంధువర్గము బ్రాహ్మణులందురు
ముందేమగునని భయపడిరి

8 విప్రులందరికి ప్రేతసంస్కారము
కర్తవ్యముగా నుండియునూ
పిలిచినగానీ రాకుండుటచె
శిక్షయిచ్చుట ధర్మమని

9 దీనికిగానూ యోచనజేసే
పూర్వఋషుల ఫలభక్షణము
రాజువారిని కత్తిరించినా
ధర్మసూక్ష్మము చింతించె

10 బ్రాహ్మణులారా మీ గృహంబులా
వెనుభాగమున స్మశానముల్
వేదాభ్యాసాదూషకులగుదురని
శాపంబిచ్చె శంకరుడు

11 విప్రులు శాపంబునకు భయపడి
శాపవిమోచన అడగగనే
నేనే ముప్పదిమూడవ పీఠమున
జనించి హరింతు నే ననెను

12 శంకరగురుడు శృంగేరిచేరి
కాలటిదృశ్యమానమును
శిష్యులకంతా తెలిపినవాడై
శిష్యనిరీక్షణ జేసెనుగా

13 పద్మపాదుడు ప్రయాణమొదలి
కాశీమొదలగు క్షేత్రములు
దృశ్యాల్ చూచి వచ్చుచునపుడు
కాళహస్తిని చేరెనుగా

14 అచ్చటనుండి కుంభకోణము
చితంబరము శ్రీరంగమూ
క్షేత్రములన్ని చూచుచు మేన
మామ గృహంబు చేరెనుగా

15 అహోబిళంబున కర్మవాది
మండనమిశ్రుని శిష్యునికి
కర్మఖండన చేసినవాడై
పంచపాదుకా చూపెనుగా

16 మేనమామ అసూయజెంది
దురాలోచన యోచించె
పద్మపాదుడు గ్రంథాలన్ని
మామ యింటిలో ఉంచెనుగా

17 రామేశ్వరము యాత్ర వెడలియు
సేతుస్నానము చేసుకొని
వాపసువచ్చి మామ గృహంబుకూ
సౌఖ్యంబుగనూ చేరెనుగా

18 అపవాదంబు పొందకుండుటకు
ఇంటిలో గ్రంథాలన్నియునూ
వుంచినవాడై అగ్ని పెట్టగా
ఇల్లు గ్రంథాలు కాలెనుగా

19 పద్మపాదుని మామగాంచి
ఇల్లు గ్రంథాలు కాలెనని
వ్యసనముచెంది ఏడ్వసాగగా
పద్మపాదు యిటుబల్కె

20 గ్రంథాలన్నియు కాలిపోయిన
గురుడు రచించును ఎట్లయిన
ఇల్లుపోయెనని వ్యసనము జెందగ
మామ యోచనచేసియును

21 భిక్షాన్నంబున విషమిడగానె
పద్మపాదుడు భుజించియు
చిత్తమైకల్యము పొందినవాడై
గురుసన్నిధిని జేరెనుగా

22 గురుడు అంతయు తెలసినవాడై
పంచపాదుక గ్రంథమును
అక్షరమిడువక వ్రాసినవాడై
గురుడు వెడలెను శిష్యులతో



## చ తు ర్థ శ్శో ధ్యా య ః

1 పద్మపాదుని తీర్థయాత్రలు
వినిన శంకరుడు వెడలియును
నాల్గురు శిష్యుల శుద్ధకీర్తియు
బాగుగ నొప్ప శిష్యులతో

2 మధ్వార్జున క్షేత్రంబునుజేరి
సౌరమతస్తుల గాంచియును
సర్వవ్యాపక బ్రహ్మశక్తియు
సూర్యుండనియూ నుడివిరిగా

3 శరీరంబున రక్తగంధము
తీసి సూర్యునకు అర్పించు
సౌరులకపుడు అద్వైతంబని
అద్వైతంబు వివరింప

4 అద్వైతంబును వారలొప్పక
మాదేవుండు ఒప్పినచో
మీా అద్వైతము ఒప్పెదుమనగా
మధ్వార్జునుని ప్రార్థించే

5 లింగమునుండి పరమేశ్వరుడు
సాక్షాత్కారము నొందియును
సత్యము అద్వైతంబని జెప్పి
అదృశ్యుండు అయెనుగా

6 సౌరపశుపతి మతస్తులందరు
శిష్యులుగాను ఏర్పడగా
అచ్చటనుండి ప్రయాణమయ్యి
రామేశ్వరము జేరియును

7 సేతుస్నానము జేసినవారై
పాఠంబులను చెప్పగనూ
విష్ణుమతస్తులు శంఖు చక్రము
ధరించవలెనని చర్చింప

8 పురాణంబులకన్నను శృతులు
ప్రభలంబనియు చర్చించి
నిర్గుణబ్రహ్మం ఆకృతులేర్పడె
ననియు గీతనూ బల్కెనుగా

9 నదులన్నియును సముద్రంబును
జేరగ పేర్లు లేవనియు
మహావాక్యముల లక్ష్యముల్ దెల్పి
శివుని మహాత్యము దెల్పిరిగా

10 హరిహర భేదము జేయగూడదని
భోదజేసి వెడలియును
విష్ణుకంచి వరదరాజులను
శివకంచియును జేరియును

11 కామాక్షి దేవాలయంబున
వామపూజను తెలసియును
అచ్చటప్రాణుల బలినికాదని
విడిపించి ముందర వెళ్ళియును

12 కర్నాటక రాజ్యము జేరినవాడై
తమ సిద్ధాంతము నిలపియును
తిరుపతికొండకు ప్రయాణమెడలి
కుష్ఠరోగిని గాంచెనుగా

13 కరుణారసమున శంకరగురుడు
కుష్ఠరోగిని చేతులతో
ఉపచారంబుజేసి రోగిని
ప్రశ్ననుజేయ ఇట్లనెను

14 పగలుసూర్యుడు రాత్రిచంద్రుడు
లేనికాలమున దీపంబు
నేను వీటిని కనులతో జూతును
బుద్ధితో దెలసితిననిజెప్పె

15 ఉత్తరంబులు చెప్పగరోగికి
జ్ఞానోదయంబు కాగానే
శిష్యునిగాను పరిగణించియు
ఉదంకుడనియు పేరిడిరి

16 ఉదంకశిష్యుని జతలోనిడుకొని
తిరుపతిక్షేత్రము జేరగనూ
శైవ వైష్ణవుల్ వాదనకొరకు
రామానుజులు నిలచిరిగా

17 రామానుజులు యుక్తి నిజేసిరి
హరిహార భిన్నంబులు రెండు
దేవుని సన్నిధిలోన ఉంచియు
రెండవదినము చూడుడనె

18 అశ్లీకానని గుడిలోనుంచి
బీగముల్ వేసి ముద్రించిరిగా
రామానుజులు యేనుగునోయని
సర్పరూపమును దాల్చియును

19 సోమసూత్రిద్వారములోన
దూరి ఆలయంబునుజేరి
శంఖుచక్రముల్ ధరింపజేసి
మరల ఈవలికి వచ్చిరిగా

20 మరుసటిదినము పరీక్షించగా
వైష్ణవశైవ చిహ్నములు
స్వామిచేతుల ధరించియుండి
అభేదరూపము జూపెనుగా

22 విదర్భరాజ్యము జేరినవాడై
క్రితచనాముడను భైరవుని
నిగ్రహించియు అచ్చటనుండి
గోకర్ణంబును జేరిరిగా

23 గోకర్ణంబున వీరశైవులు
రుద్రుడు సర్వోత్తముడనగా
శంకరగురుడు శిద్ధాంతములకు
ఏకద్వైతమే బ్రహ్మమనె

24 నీలకంఠా శివచార్యులకు
అద్వైతంబు బోధింప
వారి శిద్ధాంతము పదలినవారై
శంకరశిష్యుండాయెనుగా

25 అచ్చుడనుండి ఉజ్జైనిపట్టణము
చేరిన భట్టా భాస్కరులు
జ్ఞానికికూడ కర్మముకలదని
సిద్ధాంతంబు చెప్పెనుగా

26 జ్ఞాని కర్మను గల్గినవాడు
లోకహితార్థము జేయునుగా
కర్మము జ్ఞానిని బాధించదని
తమ శిద్ధాంతము నిల్పిరిగా

27 అచ్చుటనుండి ఆస్సాంజేరి
శాక్తేయమతస్తుల జేరియును
జటాధారణుల విడిపించియును
శిష్యులగానూ గ్రహించియూ

28 బ్రహ్మపుత్రనదీతీరమున
పర్ణశాలలో నుండగనూ
గౌడపాదాగురునాథుండు
ప్రత్యక్షంబుగ అరుదెంచె

29 వీరిభాష్యముల జూచినవాడై
పరమానందము బొందియును
నూటాఇరువది వయస్సుగురుడు
ఆదరించియును వెడలెనుగా

30 ఆసమయంబున శంకరగురుడు
దక్షిణామూర్తి స్తోత్రమును
రచించి శిష్యుల గ్రహించగానే
అభినవగుప్తుడు కోపమున

31 శంకరగురునకు శూన్యముచేయగ
భగందరరోగము ప్రాప్తించె
ఈ రోగమునుగ్రహించి గిరియు
పద్మపాదునికి దెల్పెనుగా

32 దేహాభిమానరహితులు తమరు
మాకు మీపై అభిమానం
అందున తాము ఔషదసేవ
చేయవలెనని ప్రార్థింప

33 శిష్యుల వాత్సల్యంబు గ్రహించి
శంకరు డీశుని గొనియాడి
పరమేశ్వరుడు సంతసించియు
అశ్వినీ దేవతలను బంపె

34 వారిఔషదము సేవించగనే
ఆరోగ్యంబును బొందిరిగా
పద్మపాదుడు మంత్రము చెప్పగ
అభినవగుప్తుని పొందియును

35 భగంధరంబున రోగంబునను
తోచక మృతిని పొందునుగా
ఈ సమయంబున శంకరగురుడు
బ్రహ్మపుత్రనది వద్దుండె



## పంచదశోధ్యాయః

1 ఈరీతిగనూ శంకరచార్యులు
భారతదేశము అంతటనూ
మూడు మార్లుసంచరించియు
షణ్మతంబుల స్థాపించె

2 లింగధారణలేని శైవము
చక్రాంతరహిత వైష్ణవము
జటాధారణలేని శాక్తేయము
రక్తగంధరహిత వైష్ణవము

3 ఉచ్ఛిష్టనిషిద్ధ గాణాపత్యం
సురాపానరహిత కాపలం
ఈమతంబుల దురాచారములు
విడిచిన శ్రేష్ఠమతములనె

4 షణ్మతస్థాపన ఆచార్యులని
పేరు ప్రసిద్ధి జెందియును
శిష్యులందరికి పాఠము జెప్పుచు
అచ్చట నివాసముండగనూ

5 కాశ్మీరంబున శారదదేవి
దేవాలయమున ద్వారములు
మూడుద్వారములు తెరచియుండియు
దక్షిణద్వారము వేసుండె

6 విద్వాంసులు ఎవరైనవుండిన
ఈద్వారమును తీయుడన
వినినవెంటనె శంకరుడెడలి
దక్షిణద్వారంబున నిలచె

7 తలుపులు రెండు తెరువబడగనూ
రెండుప్రక్కలలో పండితులు
భరతఖండము పండితులందరు
నిలచి చూచుచు నుండగనూ

8 విద్వాంసుండగు శంకరుండు
జగద్గురుండు అయినచో
మాకందరికి ఉత్తరమిమ్మని
ప్రశ్నను వేగ మొదలిడిరి

9 ప్రశ్నలువేశిన సాంఖ్యచపణక
కపిలకణాద బౌద్ధులున
జైన అనుమతవాదు లందరికి
ఉత్తరమిచ్చుచు రాగాను

10 శారదదేవి ప్రత్యక్షంబై
శంకరయతితో ఇట్లనెను
నీవశుద్ధుడవు ప్రవేశించుటకు
అర్హుడుకాదని నుడివెనుగా

11 శంకరుడినియు అసమ్మతంబున
నా కల్మషము జూపినచో
నేను లోపలికి రానుగాని
నాప్రశ్నల కుత్తర మిమ్మనెను

12 పుణ్యాపాపములు దేహంబునకా
జీవునకుండునో జెప్పుమన
పుణ్యాపాపములు దేహంబునకన
శంకరుడిట్లు బల్కెనుగా

13 దేహంబుకే కల్మషమనినా
పరకాయప్రవేశము గావించి
పరకాయములో జేరినగాని
రతిక్రీడయు లేదుగదా

14 ఎందుకునన్ను పరీక్షింతువన
శారదసంతోషించియునూ
శారదయపుడు తనపీఠంబున
రాజ్యాభిషేకము జేసెనుగా

15 జ్ఞానరాజ్యాభిషేకంబునకు
ఇంద్రాదులందరు వచ్చియును
దేవతలందరు పువ్వులవాన
వాద్యంబులను జేసిరిగా

16 దేవగురుని కీర్తి వెదజల్లి
అంతర్థానము నొందగనూ
శంకరగురుడు ఇదేరీతిగా
ఈపీఠములు ఉండుననె

17 బదరికాశ్రమము ద్వారకాశ్రమము
జగన్నాథక్షేత్రము ఆశ్రమము
శృంగేరియను నాల్గాశ్రమములు
ప్రశిద్ధంబుగా నిల్పెనుగా

18 తోటకచార్యులు హస్తామలకులు
పద్మపాదులు సురేశ్వరుల్
పట్టముగట్టి రత్నగణపతి
చంద్రమౌళిని ఇచ్చెనుగా

19 శిష్యులందరు లోకములోన
ప్రచారంబు చేయుడని
విగ్రహంబుల పూజించుడని
ఆజ్ఞనుజేయగ ఇట్లనిరి

20 స్వామీ మేము సన్యాసులము
విగ్రహారాధన కూడదని
దానికిగాను గీతప్రమాణము
మార్గదర్శతను జేయుడనె

21 సుగుణారాదన మహిమనుదెల్పి
అచ్చటనుండి వెడలియును
బదరి ఆశ్రమంబును జేరియును
నరనారాయణుల దర్శించె

## షోడశోధ్యాయః

బదరిక్షేత్రము విడచివెడలియు
అలకానందిని చేరగనూ
అచ్చట నరబలిగాంచినవాడై
బలిపీఠమును తన్నెనుగా

2 అచ్చటనుండి వెనుకకు తిరిగి
కేదారక్షేత్రము జేరగనూ
నాల్గునెలలు విడచిన మరల
అచ్చటవుండుట కాకుండె

3 అచ్చట జనులు చలిని సహించరు
ఆదుస్థితిని గాంచియును
తనమహిమంబున ఉష్ణోదకము
సరస్సు అచ్చట నిర్మించె

4 కేదారంబున గంగానదికి
శిలానదియని పేరుండు
అచ్చట స్నానముచేసినయెడల
శిలారూపము దేహమగు

5 ఇట్టిదుఃఖమును దీర్చిశంకరుడు
వేడినీళ్ళను నిర్మించె
ఆప్రవాహముకు తప్తగామియని
వారిచేనామము నిడువబడె

6 ఈరీతిగనూ జనులనుద్ధరించి
స్వామిసన్నిధిలో నుండగనూ
ఆచార్యులకు ముప్పదిరెండు
ఏండ్లువయస్సు ఆయెనుగా

7 ఆవయస్సుకు బ్రహ్మాదులును
ఆచార్యులతో ఇట్లనిరి
భూలోకములోని ప్రతిభంబును
అజ్ఞానంబు నశించెను

8 నీ నిరీక్షణకు పరమేశ్వరుడు
కైలాసమున జూచునని
అనిబ్రహ్మాదులు ప్రార్థింపగనూ
గుహానుగాంచిన వాడాయె

9 గుహాలోనుండిన దత్తాత్రేయులు
ఆక్షణంబున వచ్చియును
దత్తాత్రేయులు తనహస్తముతో
శంకరునిడుకొని వెడలగనూ

10 ఆచార్యులనుగాంచి శిష్యులు
నమస్కారములు జేసియును
కన్నులనిండా నీరుకార్చుచు
ఆజ్ఞ ఏమని అడిగిరిగా

11 ఆసమయంబున శంకరగురుడు
ఈరీతిగనూ బల్కెనుగా
ఇంతవరుకునూ సమగ్రమంబుగ
అంతా జెప్పినానని యు

12 భూలోకములో మనుష్యులకును
ముఖ్యకర్తవ్యము మోక్షమనే
దానికి ముఖ్యము జ్ఞానముకావలె
అందుకు సాదనకర్మంబు

13 చిత్తశుద్ధికై నిష్కామకర్మము
వర్ణాశ్రమముల ధర్మంబు
పరిపాలించిన మానవులకును
సులభము మోక్షము చేకూరు

14 ఇంద్రియంబులు బాగుండగనే
సాధనంబులు చేయుడని
శంకరగురుడు గుహలోదూరగ
అంతర్వాణి ఇట్లనెను

15 సశరీరంబుగ జగద్గురుండు
కైలాసంబును జేరెనని
ఈవాక్యములిని శిష్యులందరూ
తమస్థానంబులు జేరిరిగా

16 కైలాసంబును జేరినవాడై
నందీ భృంగి షణ్ముఖుల
చండిమాతలగు గణములగూడి
పరమేశ్వరుడు కనుపించె

17 శ్రీనివాసపుర శేషశర్మచె
వ్రాసిన వచనరూపమును
శంకరగురుడె ఈఉపాదిచే
వ్రాయించెను ఈగానముగా

18 ఈ పాటలను పాడినవార్లకు
అర్థముగ్రహించు భక్తులకు
భావముచేత అద్వైతంబు
అవలోకించి సుఖింతురు

19 శంకరచరితము గానరూపముగ
నిఖిలానందులు వ్రాసిరిగా
మహిళామాత పాడినవారై
ధన్యతనొందిరి ధరలోనా.

॥ శంకరగురువిలాససమాప్తి ॥

# గీతా సమాజముల అంత్య స్వస్తి పఠనమ

ఓంస్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతామ్।
న్యాయేన మార్గేణ మహీం మహీశాః ॥ ౧ ॥

ఓం గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాః సమస్తాః సుఖినోభవంతు ॥ ౨ ॥

ఓం కాలేవర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ
దేశోయం క్షోభరహితో బ్రాహ్మణాస్సన్తు
నిర్భయా ॥ 3 ॥

ఓం అపుత్రాః పుత్రిణః సంతు పుత్రిణస్సంతు పౌత్రిణః
అధనాః సధనాస్సంతు జీవంతు శరదాం శతమ్॥౪॥

ఓం సర్వేచ సుఖినః సంతు సర్వేసంతు నిరామయాః
సర్వేభద్రాణి పశ్యంతు మాకశ్చిదుఃఖ
మాప్నుయాత్ ॥ ౫ ॥

ఓం అసతో మాసద్గమయ తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయా

# మంగళారతి

మంగళ గురువర్యా జయ జయ శంకరయతివర్యా
తుంగభద్రెయతీరది శోభిప శృంగగిరియోళు నెలసి
హామహిమనే ॥ మ ॥ వైదికధర్మవనూ ధరెయో
ళు మోదదిసలెవనుతా ఆదితేయరు దైన్యదిబేడలు
మేదినియోళు నరరూపినోళు దిసిద ॥ ౧ ॥ బ్రహ్మ
కులదిజనిసి తందెగె బ్రహ్మపదవకొడిసి బ్రహ్మచర్య
దిద్దేతిపతియాగుత బ్రహ్మవగురుగోవింద నోళరితనే
॥ ౨ ॥ కాశీయసేరు కలివర విశ్వేశన మెచ్చెసుతా
వ్యాసవిరచిత సూత్రకె బాశ్యవలేసనె రచిసిదె
కీర్తియేగళిసిద ॥ ౩ ॥ బేదమతవగెలిదూ ధరెయో
ళు వేదమతనపొరెదు వాదది మండనమిశ్రన జయి
సుతమోదదివాణియ నెరెగలధాతగె ॥ ౪ ॥ సూరి
వరరగెలిదూ వరకాశ్మీరద పీఠవనూ ఏరుతనాల్వర
శిష్యరసలహిద భూరిమహిమ శ్రీ కంఠనె జయ
జయ ॥ ౫ ॥

మంగళారుతి ఇత్తుమురండీ నిఖిలానంద స్వాములకు
మహిళామాతా తల్లికిని ॥ ప ॥ ఆనందముతో జేరి
నవారై మహిళామాతకు మనమంతా వాసవి చరి
తము జరగినవెంటనె మంగళంబని పాడెదము
॥ ౧ ॥ చైతన్యంబే నిఖిలానందయు ప్రకృతిమా

తయే మహిళామాతయు ఈ రూపంబును భావన జేసి మంగళంబని పాడెదము భక్తితో మంగళం బని పాడెదము ॥ ౨ ॥ ఈ భావనయే తెలసినవారు నిఖిలానంద స్వామియును ఇట్టిభావనచేతనె మనము ముక్తిదాయము పొందెదము ॥ 3 ॥ కోలార్ పురికి కోరగవచ్చిన నిఖిలానంద స్వామియును వనకంద రికీ గీతబోధనజేసిన మహిళామాతకు వందనము ॥ ౪ ॥



హిందూపురం శ్రీ విష్ణు ముద్రాక్షరశాలయందు ముద్రింపబడెను.

# కోలారు దక్షిణకాశీ అంతర్గంగ మహిమ

1 దక్షిణకాశీ కోలార్ నగరము
విశ్వనాథుడే శివలింగం
భాగీరథియే అంతరగంగ
భక్తులు మహిమను గనరండీ

2 కోలార్ గ్రామంబునందునా
శతశృంగమను పర్వతముము
ఉన్నది ఈపర్వతము ద్వాదశీ
కళలు చదరమూ కలదండి

3 ఈ పర్వతము కోలార్ పురముకు
పరమడదిక్కున ఉండునుగా
ఆ పర్వతమున ఏడుగ్రామములు
నూరు శిఖరములు ఉన్నవిగా

4 ముచకుందఋషి ఈ పర్వతమున
నివాశించుచూ ఉండియునూ
ప్రతినిత్యంబు యోగమార్గమున
కాశీక్షేత్రము వెడలియునూ

5 భాగీరథిలో స్నానముచేసే
ఇచటకివచ్చి తపస్సునూ
చేయుచు జీవితయాత్రను గడుపుచు
ముచకుందఋషీ ఒకదినము

6 పొద్దుకుముందుగ వెడలిపోయెను
భాగీరథియు నింద్రించి
లేయుట ఆలసించినగానీ
కాచియుండుటను చూచియునూ

7 గంగాదేవి కరుణించియునూ
ప్రీతివాక్కులతో ఇటుబల్కె
ఓ ఋషివర్యా ఇంతకష్టపడి
ఇచటికి వచ్చే పనిలేదు

8 నీవుండెడి చోటుకునేను
త్రిరూపధారిణినైయొవత్తు
వృషభమునోటిలో ఒకరూపంబు
వృషభ బొడ్డులో రెండవది

9 విష్ణుపాదమున మూడవరూపం
అంతరగంగని నామంబు
నే ప్రవహించెడి స్థళంబునందున
సరస్సు ఒకటీ వుండునుగా

10 సరస్సుమధ్య గణపతి వుండును
అతనికి ప్రిదక్షిణముచేసి
గంగలో స్నానము చేసెడివారికి
శుభమిత్తునని ఇట్లనెను

11 ముచకుందఋషీ పంచలింగముల
ఇట్లుస్థాపనా చేయుడనె
శివలింగమునూ బ్రహ్మలింగమును
విష్ణుగణపతీ లింగములు

12 సూర్యలింగము ఇవి ఐదున్నూ
పంచాయతనా లింగములు
దక్షిణకాశీయని ఆస్థళము
నామము పొందును మీారెడలి

13 దేంస్థానము కట్టించియునూ
లింగస్థాపనా చేయుడని
మాయముకాగా యోగమార్గమున
ఋషియువెంటనే వచ్చియునూ

14 పంచలింగములు ప్రతిష్ఠచేసి
దేవస్థానము కట్టించి
గంగయులోపల ప్రవహించుటచే
అంతరగంగని నామమిడె

15 గంగాదేవి హరిహరులకునూ
వాసవిదేవి ప్రీతికినై
శ్రేయస్సాధనమగు ఈకథను
గ్రంథపుష్పముగ అర్పింతు

ఇట్లు,

ఎన్. ఎన్. శివరామగుప్త.



# పంచరత్నాంజలి



1 అంతరగంగలో భక్తితో జపములు
సలిపిన ధన్యులు అగుదురుగా
మాసోత్తమమగు మార్గశిరంబున
భానువారమూ దశమిదినం

2 వాసవిపురాణ శ్రవణ సమాప్తిలో
గీతాజయంతి సుదినమున
అంతరగంగకు నే వెడలియునూ
చూచియ ఈశుడు హృదయమున

3 వెలువడించనా వాక్కులు వ్రాసితి
కోలారాపుర వైశ్యులునూ
నూటారెండు నగరజులందరు
వైశ్యసభ్యులు తెలియరయా

4 ఇట్టివారిలో భక్త శ్రేష్ఠులు
బొగ్గరపు వంశజులైన
రామయ్యశ్రేష్ఠి మునిరత్నమ్మ
ఈ ముద్రణలో పాల్గొనిరి

5 ముచకుందఋషీ ఈశుడుగంగయు
ఈ దంపతులకు జ్ఞానమును
ఆయువు సంపద మోక్షముకీర్తిని
ఆశీర్వదించి ఇచ్చెదరు

ఇట్లు,
ఎల్. ఎల్. శివరామగుప్త.



శ్రీ శ్రీ శ్రీ యస్. నిఖిలానంద గుప్త గార్లు వీరి ధర్మ
పత్ని శ్రీమతి మహిళామాతా గార్లు



శ్రీ శ్రీ వేణు గోపాల గుప్త బ్రహ్మచారి గార్లు అభినయ బాలికలు.

శ్రీ పుణ్యాదంపతులు బి. యం. రామయ్య శ్రేష్ఠి వీరి
ధర్మ పత్ని శ్రీమతి మునిరత్నమ్మగార్లు

సుహృదయులారా

ప్రక్కన చాయాపటములో కోలారు బి. యం. రామయ్యాగారు గీతాసమాజం కమటీ మెంబర్ యితనిలో వుండే పవిత్రత జిగ్నాసత్వము త్యాగము మొదలగు సద్గుణంబులను కలవారు ఇతడు కుటుంబ సమేతంగా తీర్థాటన వెళ్ళివుండెను. తీర్థాటనలో సాధు సత్పురుషులయందు భక్తి నమ్రతలు కలిగి శ్రీవ్యాసాశ్రమము ప్రవేశించి శ్రీ శ్రీ శ్రీ సద్గురు మళయాళ స్వాములవద్ద జంకు కొంకలులేక భగవద్గీతను వుపన్యసించి కోలారు భక్తుల కృషిని వెల్లడించిన ఘట్ట యిదేరీతిగ యాత్రిలలో రామేశ్వరము హైదరాబాదు రాజమండ్రి వగయిరా యాత్రికులకు శ్రీభగవద్గీత శ్లోకములు అర్థములు కథలు చెప్పి వారిహృదయము ఆనందింపచేసినభక్తుడుకాకను మహాత్ములను ఆశ్రమములను దేవ దేవస్థానముల పుణ్యాతీర్థములను, దైవభక్తులను దర్శించిన పుణ్యాదంపతులు వాసవాంబ పురాణము గీతాసమాజంలో వుదారముగా పనిచేయుట బట్టి గీతాసమాజం కమిటీమెంబరుగా అంగీకరించిరి చాయా చిత్రము యీ పవిత్ర గ్రంధంలో వేయించు వేళకు యితడు గ్రామములో లేనందువల్ల యీవ్యక్తిని

అలాయిబాయిందులో చేర్చదలంచి శ్రీ శ్రీ శ్రీ ఎక్. నిఖిలానందగుప్త మహిళామాతగార్లవల్ల చేర్చబడినది.

1 కోలారు నగరము వాసవకన్యక
గీతా మాతా వుభయులను
బి. యం. రామయ్యాను భక్తునకు
భవ్యజ్ఞానం బిచ్చెదరు

2 కర్మాచరణ ప్రజల బలంబు
ధనసంపాదన మించినది
త్యాగముకన్న లేదని వేదము
అట్టిత్యాగమును జూపెనుగా

ఇట్లు,
శ్రీ ఎక్. నిఖిలానందగుప్తస్వామి.



కోలారు ఆర్యవైశ్య గీతా సమాజము యొక్క
కార్యనిర్వాహక కమిటీ సభ్యులు
సమాజము మెంబరులు సహా

1) ఎస్. వి. రామయ్యశెట్టి
2) బి. ఎల్. వెంకటచలపతయ్యశెట్టి
3) చిందలూరు శంకరనారణయ్యశెట్టి
4) బి. యస్. రంగయ్యశెట్టి
5) బి. యం. రామయ్యశెట్టి
6) అయితాండపల్లి లక్ష్మినారణయ్యశెట్టి
7) వక్కలగంట చంద్రయ్యశెట్టి
8) మానంది మునిరామగుప్త
9) చిందలూరు భరతరామయ్యశెట్టి
10) శ్యాపూరు నారాయణసామయ్యశెట్టి



కోలారు శ్రీ ఆర్యవైశ్య గీతాసమాజం పురుషరత్నములు

ఈ చాయా చిత్రంలోగల గీతామహిళల నామములు
కోలార్ గీతా సమాజం.

1 బి. ఎస్. పద్మావతమ్మ
2 బి. ఎన్. అమృతమ్మ
3 కె. టి. రాజరత్నమ్మ
4 డి. ప్రమీళమ్మ
5 ఎన్. పి. లక్ష్మీకాంతమ్మ
6 బి. ఎస్. శాంతకుమారి
7 ఎ. ఎస్. సత్యభామా
8 బి. ఎన్ రాజమ్మ
9 ఎన్. ఎస్. రాజమ్మ
10 ఎస్. కె. నాగమ్మ
11 ఎ. ఎన్. లలితమ్మ
12 ఎస్. బి. ప్రేమలీలమ్మ
13 బి. ఆర్. ప్రేమలీలమ్మ
14 సి. ఎస్. రాధాలక్ష్మమ్మ
15 జి. ఆర్. సరస్వతమ్మ
16 ఎస్. బి. కనకరత్నమ్మ
17 బి. ఆర్. పంచరత్నమ్మ
18 ఎ. ఎన్. లలితాంబమ్మ
19 కె. ఆర్. సరస్వతమ్మ
20 సి. ఎన్. గోకులమ్మ
21 బి. సి. పద్మావతమ్మ
22 బి. సి. గోపమ్మ
23 ఎ. జె. లక్ష్మీదేవమ్మ
24 ఎన్. మహిళామాతగారు
ఎన్. ఎన్. నిఖిలానందగుప్త
25 ఎస్. ఎ. వెంకటలక్ష్మమ్మ
26 ఎ. ఎస్. సరస్వతమ్మ
27 బి. పి. మణమ్మ
28 జి. పి. రాధమ్మ
29 ఎస్. ఎల్. ప్రమీళమ్మ
30 కె. టి. శాంతమ్మ
31 బి. జి. సౌందర్యమ్మ
32 బి. వి. సుశీలమ్మ
33 బి. సి. సుజాత
34 ఎ. జె. పద్మావతమ్మ



కోలారు శ్రీ ఆర్యవైశ్య గీతాసమాజం మహిళలు

## గీతా సమాజం వారి వారం పూజల సేవానామములు

1 సి. బి. సరోజమ్మ
2 ఎ. ఎస్. సరస్వతమ్మ
3 సి. ఎస్. రాధాలక్ష్మమ్మ
4 బి. ఆర్. ప్రేమలీలమ్మ
5 టి. వి. సీతమ్మ
6 ఎ. ఎన్. రుక్మిణమ్మ
7 ఎ. ఎన్. సరోజమ్మ
8 బి. కె. కాంతమ్మ
9 ఇ. ఏ. నాగమ్మ
10 కె. టి. రాజరత్నమ్మ
11 బి. వి. పుష్పావతమ్మ
12 ఎ. ఎన్. లలితమ్మ
13 టి. వి. గౌరమ్మ
14 బి. కె. అశ్వత్థమ్మ
15 ఎస్. కె. నాగమ్మ
16 బి. ఎస్. పద్మావతమ్మ
17 బి. సి. పద్మావతమ్మ
18 కె. టి. శాంతమ్మ
19 జి. పి. లక్ష్మీకాంతమ్మ
20 ఎన్. సి. రాధమ్మ
21 ఎ. ఎస్. మహాలక్ష్మమ్మ
22 బి. జి. సౌందర్యమ్మ
23 ఎ. ఎన్. లలితాంబమ్మ
24 ఎ. జె. లక్ష్మీదేవమ్మ
25 బి. కె. శాంతమ్మ
26 బి. సి. గోపమ్మ
27 బి. పి. మణమ్మ
28 ఎస్. ఎల్. ప్రమీళమ్మ
29 పి. ఎస్. లక్ష్మీకాంతమ్మ
30 జి. జయలక్ష్మమ్మ
31 ఎస్. యం. కాంతమ్మ
32 బి. ఎన్. అమృతమ్మ
33 బి. ఎస్. రత్నమ్మ
34 ఆర్. ఎన్. శకుంతలమ్మ
35 ఏ. ఎన్. సుబ్బమ్మ
36 యం. అశ్వత్థమ్మ
37 ఎస్. పర్వతవర్ధనమ్మ
38 టి. పి. శాంతమ్మ
39 టి. పి. నిర్మలమ్మ
40 బి. కె. సత్యవతమ్మ
41 కె. ఎస్. శారదమ్మ
42 కె. ఎస్. ఉమావతమ్మ

| | |
|---|---|
| 43 బి. యం. సునీతమ్మ | 49 కె. మునియమ్మ |
| 44 టి. వి. పద్మావతమ్మ | 50 ఎ. భాగమ్మ |
| 45 ఎ. జె. పద్మావతమ్మ | 51 టి. జి. రామరత్నమ్మ |
| 46 ఎస్. కె. లక్ష్మీకాంతమ్మ | 52 సి. యం. కాంతమ్మ |
| 47 డి. ప్రమీళమ్మ | 53 వి. జి. రత్నమ్మ |
| 48 ఎస్. బి. ప్రేమలీలమ్మ | 54 యం. యం. రంగమ్మ |



## మంచేపల్లి శ్రీ ఆర్యవైశ్య గీతా మహిళలు మరియు పాఠశాల బాలికలు.

| | |
|---|---|
| కె. యస్. శకుంతలాబాయి | కె. వి. సీతాలక్ష్మమ్మ |
| టి. ఎన్. సంజరత్నమ్మ | టి. కె. భాగ్యలక్ష్మమ్మ |
| వై. ఎన్. సునందాదేవి | యం. జి. నాగరాజమ్మ |
| టి. ఎస్. పద్మావతమ్మ | నాగలక్షమ్మ |
| పి. కె. రత్నమ్మ | టి. జి. రామరత్నమ్మ |
| కె. ఎ. సువర్ణమ్మ | పి. ఎన్. తులశమ్మ |
| వై. ఎ. సుబ్బరత్నమ్మ | టి. ఎన్. పంచరత్నమ్మ |
| టి. బి. సుందరమ్మ | బి. ఎస్. శకుంతలమ్మ |
| యస్. వి. నాగరత్నమ్మ | కె. రత్నమ్మ |
| యం. కె. ప్రేమకుమారి | యం. జి. ఆదిలక్ష్మమ్మ |
| పి. వి. సుబ్బరత్నమ్మ | పి. వి. పుష్పావతమ్మ |
| పి. ఎన్. నాగరత్నమ్మ | యం. ఎస్. వెంకటలక్ష్మమ్మ |



మంచేపల్లి శ్రీ ఆర్యవైశ్య గీతా మహిళలు మరియు పాఠశాల బాలికలు

శుభమస్తు

## శ్రీ శ్రీ శ్రీ భగవాన్ స్వామి చిద్గగనానందమహర్షుల చే స్థాపింపబడిన గీతాసమాజములు

---

1 ప్రేమగీతామహిళాసమాజం — వై. ఎన్. హొసకోట

2 వాసవిగీతాసమాజం — కాకినాడ

3 దేవిగీతాసమాజం — జగన్నాథపురం

4 గీతాపాఠశాల — తుని

5 గీతాఅధ్యయనశాల — సామర్లకోట

6 గీతాసమాజం — మంచేపల్లి

7 వాసవాంబాగీతాసమాజం — చింతామణి

8 గీతాసమాజం — బౌరింగుపేట

9 ఆర్యవైశ్యగీతాసమాజం — కోలారు

10 ప్రేమగీతాసమాజం — హోసూరు